# విజ్ఞప్తి.



పండితలోకమా ! నమస్కారములు.

గ్రంథరచనాభిలాష నేఁటిదిగాదు. రూపక కథలపై నున్నయాసక్తి చరిత్రాత్మకములపై లేదు. అయినను, ప్రయత్నమున నష్టములేదని యీ రూపమున మీయెదుట నీపొత్తము నుంచితిని.

సారంగధరకథ వ్యాప్తిలోనుండు ఫక్కికి విపరీతముగ వ్రాయుట సాహసము గాకపోదు. కాని యిందుల కాధారములు లేకపోలేదు. చిన్ననాటనుండి పెంచి, ప్రవర్తనను గమనించిన తండ్రిగారు సుతు ననుమానించిరనుట నాకు నమ్మకములేనిమాట.

అదియుండనిండు, చరిత్రలందు పినతండ్రివలన నతఁడు దేశభ్రష్టుఁడయ్యెనని యున్నది. ఆ యొక్కయంశమే నా గ్రంథమున కెత్తుగడయగునని దలంచితిని. కవిజీవితములందు శ్రీ॥ శ్రీ॥ కం. వీరేశలింగము పంతులుగా రితనిగూర్చి వ్రాసిన ఫక్కి కానందించితిని. అట్టి యమేయప్రతిభాశాలి కథ వ్రాయుట ప్రశంసార్హమని తలంచితిని. కాని ఫలము ! మన యాంధ్రచారిత్ర యసంపూర్ణము. నా యీ కథానాయకునిగూర్చి పలువురు పలువిధములుగ వ్రాసిరి. ఆ వ్రాత

లన్నిటి ననుసరించితిని. కొన్నిచోట్ల యందులకు విరుద్ధముగా వర్తించితిని.

పంతులుగారు 1063 వఱకు రాజరాజే వేంగిని పాలించెనని వ్రాసిరి. ఇది యనుసరించిన నాకథకే భంగమని యాహవ్మల్లుని మరణము 1051 ప్రాంతములందైనటుల వ్రాసితిని. ఆంధ్రలోక ముదాహరణమొయి కుమింపదా? 1054 ప్రాంతములందు సారంగధరుఁడు 1040-69 వరకు పశ్చిమ చాళుక్య నాథుడై యాహవమల్ల బిరుదాంకితుఁడగు ప్రథమ సోమేశ్వరు నాశ్రయించినటుల హిందూదేశచరిత్ర చెప్పుచున్నది. దీనిఁబట్టి పైమార్పునకు సాహసించితిని.

ఆహవమల్లుఁడు 1060 ప్రాంతములం దాత్మహత్యగావించుకొనినటుల వ్రాసితిని. (చరిత్రయందిది 1069 లో ననియున్నది.) ఆ చరిత్రయందే యాహవమల్లుని ద్వితీయ సుతుఁడగు విక్రమాదిత్యుఁడు సోదరుని కపటోపాయమున దేశభ్రష్టుడై 1062-70 వఱకు చోళభూమిని పాలించుచుండిన వీరరాజేంద్రు నాశ్రయించినటులున్నది. ఆంధ్రవీరారాధన (పు॥ 23) యందు పూర్వ చాళుక్యులపై విక్రమాదిత్యుఁడు దండెత్తిరా విదేశగతుఁడగు సారంగధరుఁడు పినతండ్రికి సహాయపడినటులున్నది. అయ్యది నా కథకు సంపూర్ణముగ విరుద్ధముగ నున్నది.

చరిత్రనుబట్టి 1069-76 వఱకును (నా యభిప్రాయమున) పశ్చిమచాళుక్యుల ద్వితీయ సోమేశ్వరుఁ డేలు

చుండెనని తెలియుచున్నది. అదిగాక కులోత్తుంగుడే పశ్చిమ చాళుక్యులపై నెత్తిపోవ విక్రమాదిత్యునివైపు, సేనలు సోమేశ్వరునివదలి పోయినటుల చరిత్రయందున్నది. అందు వలన చక్రవర్తిత్వ మభిలషించిన వీరరాజేంద్రునివిక్రముడు వెంబడించెననుట సమంజసముగ నుండును.

అదిగాక 1076 ప్రాంతములందు కులోత్తుంగుడు చోళరాజ్యమున కధినాథుడయ్యెను. నాయూహ సత్య మైనచో నాఱవ విక్రమాదిత్యుడు 1069 ప్రాంతమునరాకే చోళరాజ్య విషయమున స్పర్థకలవాఁడై యుండెను. 1070 నుండి 1080 వఱకును నీ వీరులిరువురును సమరముల సలుపు చునేయుండిరి. కాఁబట్టి విక్రమాదిత్యుఁడే యాంధ్రభూమిపై నరుదెంచెననుట నే విశ్వసింపనైతిని.

రాజసుందరి రాజరాజున కిచ్చినటు కవిజీవితములందు వ్రాయఁబడి యున్నది. అది కారణముగ నుత్తర కళింగ కథను పూర్వ సంబంధముండిన బాగుండునని వ్రాసితిని. రాజరాజు 1030-77 వఱకు ధరాపాలన మొనర్చెనని యున్నది. అది యాతని తండ్రి వజ్రహస్తుని కాలమైనచో సరిపోవునని తలంచితిని.

1063 లో రాజ్యమునకు వచ్చినవాని దౌహిత్రుఁడు 1077 లో కళింగ ప్రభు వయ్యెనను టెంత సమంజసముగ నుండునో పాఠకు లూహింతురుగాక. ఇది నా మార్పునకు నిమిత్తము.

చరిత్రలందు అసహాయ శూరుఁడై వేంగి పల్లవ చోళ దేశములకు నాయకుఁడై యుండిన కులోత్తుంగ చక్రవర్తినిగురించి వ్రాయకుండుట శోచనీయము. చరిత్రకారులకు నాకుఁగలిగిన సంశయములే కలిగియుండినచోఁ జెప్పునదేమి?

చరిత్రాత్మకనవల యని పేరిడుటవలన నిన్నివిషయములు వ్రాయవలసెను. మన దేశ చక్రవర్తుల పాలనా విషయమును దెలియఁగోరుట కంటె ఆంగ్ల చరిత్ర యందలి 'డంకిర్క్' యుద్ధకారణ విధాన ఫలితములఁ దెలియఁగోరు పాఠకులుండిన వారి కాలహరణమునకు క్షమ ప్రార్థితము.

విధేయుఁడు,
ఉభయభాషా ప్రవీణ
చెన్నుభట్ల వేంకటకృష్ణశర్మ,
కోల్సు హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు.

కర్నూలు,
1—1—33.

శ్రీరామచంద్రాయనమః.

# కులోత్తుంగ విజయము.

## ప్రథమ ప్రకరణము.



అది మధుమాసము. మాధవుడు నిజనాయకు నాజ్ఞ శిరమునధరించి యాంధ్రావని ముట్టడించెను. ఆంధ్రులు జననిని స్వాధీనపఱచుకొను టా యనంగుని జైత్ర యాత్రకుఁ గారణము. మనోహరనినదముల ద్విజగణము లొనర్చుచు, వేదపాఠ మొనరించు గోదావరీ తీరవాసుల ద్విజోత్తముల నధఃకరించుచున్నవా యన్నటు లుండినది. మాధవు నాగమన జనిత మోదాతిశయమున వనలక్ష్మి నూతన వికసిత సుమజాలములచే హాస మొనర్చుచుండెను. లోకము నంతయు నిజపాదాక్రాంత మొనర్చుకొనిన పంచశరుఁ డరుదెంచునని రత్నకంబళ ప్రచ్ఛాదితమైనట్లు మేదిని యలరారుచుండెను. చిగురాకు లామీనకేతనున కస్త్రము లగుట చాలక, తోరణములై మనో నయనములకే యానందము నొదవించు చుండినవి. మానవకృత శృంగార రసాభాసత నెఱుకపఱచెడినో యన ప్రకృతిశృంగార మేవంక చూచినను ప్రశంసాపాత్రమై, సహస్రాక్షుని యక్షి బాహుళ్యత కీను నెట్టిదైన నందునటు లొనర్చుచుండెను.

పాఠకమహాశయులు గోదావరీప్రాంతమున కరుదేర వలసియున్నది. రాజమహేంద్రవర ప్రాముఖ్యత నిట తెలుపు టనవసరము. మధుమాసమున, అందును ప్రాతః కాలమున, అందును బురోద్యానమునఁ బ్రకృతి యెటు లుండును? ఊహాతీతమగు నద్దాని వర్ణింపఁగడంగుట శక్తి ప్రకటించుటయగు.

అటుతిలకింపుఁడు. గోదావరీ తరంగములపై కలహంసములు తూగుటుయ్యేల లందుండు కవిహంసలక్రియ నొప్పుట పరికింపుఁడు. మధుకరాంగనలు మధువు నపారముగ సేకరింప గలిగితిమని కాఁబోలు భర్తల కవ్యక్తమధుర రుతముల దెల్పుచున్నయవి. పరభృత మొండల్లదె నిజాంగన కేదియో రహస్యము నుడువుచున్నయది విలోకింపుడు. అయ్యది సహకారపుఁ గెంజిగురాకును మెసవెనని రసజ్ఞులగు మీరు గ్రహించియుందురు. ఆ నికుంజములు, ఆ లతాంత శకుంత సంతానయుతంబులగు శాఖలు, వీచీ కరంబుల నానందంబుగ తీరశాద్వల ప్రదేశముల స్పృశించు పద్మాకరములు, ఎట్టి భాషాజ్ఞాన రహితునకైన భావకవితను గలిగించున దగుటలేదా!

పోనిండు వాటితోనేమి? అటులా మల్లికానికుంజమును దిలకింపుడు. తూలికాహస్తుడగు యువకుఁ డగుపడుటలేదా? చిత్రభిత్తికాస్థితుండగు ననంగు నధఃకరించు నారూపము మిము ముగ్ధులఁ జేయుటలేదా? ఏలచేయదు? చిత్రరచన

యందు నిమగ్నుఁడగు నాయువకుఁ డచలితేంద్రియుఁడగుట నేఁటికాలపు ఛాయాచిత్రకారుల కెంతటియుల్లాసకారణుఁడై యుండును. అదిగో! ఏమాయెను. చూడుఁడా తూలికను బడవైచి యెటు వికటాట్టహాస మొనరించుచుండెను! వింశద్వత్సర వయస్కుఁడగు నాయువకుఁడట్లు హాస మొనర్చుట కాతని హృదయాంతర్భాగ మెంతటిపవిత్రమై నిష్కల్మషమై యుండనోపు. ఆతఁడాచిత్తరువు నటు బడవైచి వేణువు నూద నారంభించెను. ఔరా! ఏ మాతని గాన విద్యా ప్రభావము? గోపాలబృంద తన్మయకారకుఁడగు గోవిందుని మఱపించు నాతని గానవిద్యావైశారద్యము మాలేఖిని యేమనివర్ణింపఁగలదు. అటుచూడుఁడా ద్విజసంఘ మెంతటి యీర్ష్యాభావమును నిజపక్షచ్ఛటావిక్షేపణమున నగుపఱచెడిని. అచేతనములే చిగిర్చెడు నెడ గానతత్త్వవేత్తలగు పక్షికోటివిషయము చెప్పనేల?

వేణువు నటవైచి యా యువకుఁడొక తాళపత్ర గ్రంథమును గైకొనియె. అయ్యదేదని విచారింపనేల? వాగనుశాసన విరచిత శబ్దానుశాసనము. మా పాఠకు లాతఁ డెవరైనదియు నూహించియే యుందురు. మఱల నాతఁడా గ్రంథము నటవైచి చిత్తరువును గొనెను. పరేంగితావగాహులగు పాఠకులాతని మనంబాందోళనాయత్తమై యుండెనని గ్రహించియుందురు.

ఆ యువకుఁ డజాగ్రత్తమొయి తూలికనుపయోగించుటను కాంబోలు నాచిత్తరువు నూతన శోభను బడసినది.

అది యాతని యుద్దేశమునకు వ్యతిరేక మగుటవలన విసరి వైచెను. ఆచిత్తరువు ప్రాంత నికుంజ ముఖప్రదేశమునఁ బడెను. నీల నీరదాంతర్గతవర్తిని యగు విద్యుల్లతికబలె నొక మోహనాంగి వెలువడి యద్దాని గ్రహించెను. ఆపె యెవరు? అట నెందులకు దాగియున్నది? ఎంత కాలమైనది? ఆచిత్తరువు నేల గ్రహించినది? ఆతని దృష్టిపథమున నేల పడసాహసింపకున్నది ఓ! యీ ప్రశ్నలెందులకు?

ఆవేణుగాన మంతకంతకు మనోహరత నందుచున్నది, ఆఁగినది. దానికిఁగారణము పురుషద్వయమటఁ బ్రవేశించుటయ. ఒకఁడు మధ్యమ వయస్కుఁడు; ద్వితీయుఁడా యువకుని వయసువాఁడు. వారిరువురు యోధవేషముల నుండిరి. దరహాసమొందు వారి దర్శించినంతన మన యువకుని ముఖబింబమునం దుద్యోతమగుట వారాతనికిఁ గూర్చువారని గ్రహింపనగును. అంత యువకుఁడు "విజయా! ఏమి 'నసాన్యత్సర్గరోన్నతః' అను సూత్రార్థము విమర్శింప నరుదెంచితివా! ఆచార్యులవారు".

"రాకుమారా! చాలును. నీవ్యాకరణ పాండిత్యము గాని, గానలోలతగాని, రాజ్యలాభము గలిగింపదు".

"అయిన"

"ఇదిగో! కరవాలము."

"అబ్బా! అబ్బా! ఏలయది? నాగుండియ లదరుచున్నవి. గాత్ర మస్వాధీన మగుచున్నది. మిత్రమా! జాగ

రూకుఁడవు గమ్ము. పొరబాటున వదలుదువు సుమా ఆమారణ సాధనము? అవ లుంచుము. క్రియాపరిచ్ఛేదము సెప్పెదను."

"వీరాగ్రగణియగు రాజరాజనరేంద్రుతనయుఁ డింతటి భీరుఁడని కలనైనఁ దలంపనైతిని. విష్ణువర్ధన వంశమున కప కీర్తి తేనేల యత్నింతువు? ఆశాపిశాచా విష్టుఁడగు మీపితృవ్యు నెదురింపుము. చేతగాకున్న వాని మట్టుపెట్ట నాకనుజ్ఞ నొసంగుము."

"విక్రమసింహా! విక్రమసింహా! వాచాదోసమెందు లకు? ఊరకుండుము. నాపితృవ్యునే! నా జనకుని గారాబు తమ్మునే! నావంశములోని వానినే! మట్టుపెట్టుటయే! అయ్యో! నీకు నోరెటులాడెను? సేనానివగు నీవేయిట్లు లాడిన ఏమననగును? ఎంతటి దుర్దినమిది?"

"అయ్యా! ఆ దండకము చాలింపుము. విని విని వేసరిక గల్గినది. నేనిపుడు మీపితృవ్యుఁ నాజ్ఞానుసార మిష్టము లేకున్నను చోళమండలముపై నెత్తిపోవుచుంటిని. మరల నేవచ్చులోపల పితృవ్యమరణమో, వనవాసమోనిశ్చయించు కొనుము. నా తనయుఁడు నావెంట నరుదెంచువాఁడు."

"అవునా విజయా! పోదువా? నరుల జంపుదువా? ఆచార్యులవారు దెల్పిన భూతదయ——"

"మిత్రమా! ఆచార్యులవా రిపుడే యుండినచీకు బుద్ధి సెప్పియుండెడివారు. మాజనకుల మాట మఱువకు. పోయి వత్తును."

"ఇదిగో! మధురాంతక మగుపడిన నూతన కీర్తనల రచించితినని తెలుపుము."

"ఆఁ—పిఱికిపందయనికూడ తెలుపుదుము"

"సేనానీ! భూతదయ యనునదెఱుఁగవా?"

అందులకుఁ బ్రత్యుత్తరమీయక యా చళుక్యవాహినీ పతి తనయులతో నచటు బాసెను. మన యువకుఁడొక దీర్ఘోచ్ఛ్వాస మొనర్చి వారివైపు జూచుచు శ్యామలకోమలతృణ కుసుమ ప్రచ్ఛాదిత భూతలమున పరుండెను. అతని మానస వీధి నెట్టి భావములు పరుగులాడెడినో చూతమా? వలదు రండు.

## ద్వితీయ ప్రకరణము.



విజయాదిత్యుఁడు ప్రాచ్యచళుక్యుల కేలిక. నలువదియైదు వత్సరములు సుఖజీవనము నతీతముగ ననుభవించె ననుటకతని స్థూలకాయతయే చూపుచుండెను. అతఁడురూపవంతుఁడే కాని యుర్లగడ్డలవంటి బుగ్గలును, తటాలున నాగిపోయిన నాసికయు నటు లననీయకుండినవి. అతఁడు మహారాష్ట్రాచారముగ వస్త్రముల ధరించుచుండును. స్వభావము కుటిలమైనదే గాని స్వతంత్రత లేదు. ఆ రాజునకు నాలోచనముఁ జెప్పువారనేకులు గలరు. అతని ప్రధానుఁడు నారాయణభట్టు. తంత్రములు దురవగాహములు. ఆ బ్రాహ్మణుఁడే లేకుండిన సోదరుని రాజ్యమును స్వీకరింప నాతఁడు జతన మొనర్చి యుండడు.

ఇప్పుడు విజయాదిత్యుఁడు పల్లవరాజ తనయ వాసంతికపై మరులు గలిగియుండెను. సారంగధరుని చిత్తరువు జూచినంత పల్లవుల నాయకుఁడు తన తనయ నొసంగ సమ్మతించెను. ఆ బాలిక రాజమహేంద్రవరమును సముచిత పరివార సమేతయై చేరెను. నిజము, విజయాదిత్యుఁడు వాసంతికను సారంగధరునకై రప్పింపలేదు. తన సతి సింహపురీశు తనయ, మదాలసపై, నసహ్యము కలిగియుండెను. మదాలస కిరువది వత్సరముల వయసు; అచ్చున తీర్చినట్టి యాకారము. మఱి విజయాదిత్యు నసహ్యతకుఁ గారణము? దుర్జనులకుఁ గారణ మేల? స్త్రీలోలత చాలదా? అది యటులుండ మదాలసకు సుతోదయము కాలేదు. తన యనంతరము రాజ్యము సారంగధరునకుఁ బోవుటాతనికిష్టములేదు. అందువలన వాసంతికను వివాహమాడ తలంచెను. ఆమె హృదయము సారంగధరునిపై నుండినది. ఒకటి రెండు మారులా యువకునిఁ జూచియుండినది. చిత్తరువునందలి లోపముల గనుఁగొనగలిగినది. ఆతని వేణుగానమును వినినది. తన్మయయై పోయినది. తన కుండు చిత్రకళానైపుణ్యమున వాని రహస్యముగఁ జిత్రించుకొనినది. ఇక విజయాదిత్యు డాస వదలుకొనవలసినదే.

'వలదనిన పోవుటకు వైదికుఁడా?' అనినటులతఁడు యువతీ హృదయేంగితావగాహి యగు నంతటి రసికుఁడు గాఁడు. వలపులేని కాంతను వదలునంతటి వివేకిగాఁడు. ఆయమ నెన్నియేని మారులు బ్రతిమాలి చూచెను. నిష్ఫల

మనోరథుఁడయ్యెను. ఆ రాకొమరిపై వలపంతకంతకు మించి పొవుచుండెను. ఆమెను బడయనిది తా జీవించియు ఫలము లేదని యెంచెను. మనోదార్ఢ్యము లేనివాఁడగుట బలవంతము సేయఁజాలకుండెను.

వాసంతిక షోడశవర్ష ప్రాయ. రసికుల చేఁబడని సుమరాజమువలె, భ్రమరసందోహ సంచార హీనమగు భానూదయ సమయ వికసిత పయోరుహమువలె రాజిల్లు చుండెను. ఆపె ప్రత్యంగ సౌందర్య గరిమను వర్ణించుట మహాకవి ప్రయోగ పదజాల చౌర్యమగును. ఆ వినీల కుంతలములే మానసికాందోళనమును గలిగింప సమర్థములై యుండ, తీక్ష్ణములై, యువక హృదయ విదారకములై, జితేంద్రి యాపజయ కారకంబులగు చూపుల విషయము వలుకనేల? రత్నదీధితుల దిగంతరాళముల వ్యాపింపఁ జేయు నా నునుఁజెక్కులు దర్పణముల నతిశయించుననుట వర్ణనమెటులగును? ఆ చిబుకము యువతీలోకపరాఙ్ముఖునేని యొకసారి పట్టివిడువఁ బ్రేరేపించెడు ననిన చాలదు. అధరము మోహపాశ బద్ధుడై నిజప్రియా ముఖబింబ చుంబన ప్రయ త్నుఁడగు మాతనయుఁడైన నిది చూచి, యది మాను నందమా? ఇఁక చాలును.

అట్టి రూపజితరతియగు నా వాసంతిక తన గదియం దొకనాఁటి ప్రాతర్వేళ హంసతూలికా తల్పమునం దేదియో తలంచుచు పరుండి యుండినది. స్త్రీ మనో భావముల

నూహింప నారదునంతటి మహాత్ముఁడసమర్థుఁడఁట. మన మనగ నెంత ?

విజయాదిత్యుఁడు శృంగారిత తనుఁడై యటఁ బ్రవేశించెను. సర్ప స్పర్శయుంబోలె నా రాకొమర్తె యదరిపడి నిలచెను. విజయాదిత్యుని హృదయ మొకమాఱు ఆఁగిపోయెను. సహజదీనతాధీన మగు నాతని ముఖము మఱింత తెల్ల బాఱెను. ఎట్టకేలకు దృఢప్రయత్న సంపాదిత ధైర్యుఁడై యారాజు సమీపమందలి యాసనము నలంకరించెను. గొంతు సవరించుకొని,

“ యువతీ! మహారాణివి కానేల కోరవు ? ”

“ నాతో మాటాడవలదని చెప్పియుంటిని. ”

“ నా ప్రేమ మతీత మగుచున్నది. ”

“ ఇంకను గానిమ్ము. ”

“ ఎటులను నిను విడువను ”

“ ప్రాణముల విడిచినను— ”

“ ఆఁ— ”

“ అటులైన నా శవము నీ స్వాధీనమగునులెమ్ము. ”

“ అట్టి ప్రసంగము నొనర్పకు. నీ వసువుల బాసిన యుత్తర క్షణమున నే మనియుందు ననుకొందువా ? వాసంతికా ! నీ వెఱుఁగవు గాని నా ప్రతి రక్త బిందువును నీ యాకృతిని ధరించి యున్నది. ”

“ అయ్యా! ఈ ప్రసంగమును వదలి యావల కేఁగుము. ”

"నీ పరిష్వంగసుఖ మనుభవించనిది యీవల కేఁగుటకు నా పాదములు కదలినగదా ?"

"నా పరిజను లెటనుండిరి ?"

"ఉండవలసిన చోటనే"

"వారినేల పంపితివి ?"

"నీ బోఁటి సౌందర్యగరిమ నందియుండమి"

"అధిక ప్రసంగము వలదు. అసహాయ నాయాస పెట్టుట రసిక లక్షణము కాదు"

"ఆ రసిక లక్షణమే యిట్టు ప్రార్థింపఁ జేయుచున్నది. కాకుండిన—"

"ఆఁ—"

విజయాదిత్యుఁడు నిలిచెను. ఆ బాలికను సమీపించెను. ఆపె చటాలున శయ్యను దాఁటెను. అతఁడు దాఁటుటకు కొంతయాలస్యమయ్యెను. కేళీలోలులగు బాలబాలికలవలె వారు కొలఁది దూరము పరుగిడిరి. వాసంతిక యాక్రూరకరగ్మ నకుఁజిక్కెను. నిర్దయా స్వాంతుఁడగు వ్యాధుని కరగతమగు పికాంగన భాతి యా సుకోమలి యొక యఱచి మూర్ఛిత యయ్యెను. ఆపెను శయ్యపైఁ బడవైచి తుట్టె పెదవులతోఁ గపోలమును, నయనములఁ, జెక్కిళుల, చుబుకమును జుంబన మొనర్ప నెంచి తలవంచెను. పెదవులకును గపోలమునకు నంతరమంతగ లేదు ? అంతలో నాతని వీఁపున కేదియో గ్రుచ్చికొనియెను. గుండియలు ఝల్లుమన వెన్నె

ముకను జక్కచేసికొనియెను. తిరుగలేక వెనుదిరిగెను. ఆతని హృదయము మాఁగిపోయెను.

ఒకవ్యక్తి రక్తాంబరధారియై నిలచియుండెను. ఆతని నయనములును ముఖమందలి కొంత భాగమును గప్పఁబడి యుండెను. ఆతఁడు యువకుఁడనియు, బలిష్ఠకాయుఁడనియు, పంచవింశద్వర్షుఁడనియు నా తడబాటు నందిన విజయాదిత్యుఁడు ఊహించుకొనియెను. ఆతని హస్తగతముగు నిశిత కరవాలము తన హృదయమంత వేగముగ కొట్టుకొనుటకుఁ గారణమని రాజు కడ కేఱుంగఁ గలిగెను.

"అసహాయులగు నబలల నలమట పఱచు టెన్ని దినములనుండి చళుక్యరాజులు నేర్చిరి ?"

"నీ వెవరు ?"

"అధర్ముల పాలిటి యముఁడను, నన్ను వనకేసరి యందురు. ఇంకను నా పరిచయము కావలయునా ?"

"నీ విటనుండి పోవలయును"

"అవును పోవుదును. ముందా యువతిని క్షమింపఁ గోరుము."

"అది నీచే కాదు"

"అవివేకీ ! పురుషునకుఁ జేతకాని దేది ?"

వాసంతిక కన్నులఁ దెఱచెను. ఆ దృశ్యము నంతలో గ్రహింపఁ గలిగెను. ఆప్రచ్ఛన్నవ్యక్తి తనను రక్షింప నరుదెంచిన వాఁడని తలంచెను. చటాలున లేచి యాతని జూసి, "మహాభాగా ! రక్షింపుము, అనాధను" అనెను.

"వనితా! భయపడకుము. ఇంకను చాళుక్య రాజ్యలక్ష్మి ధర్మావలంబనమున ననాథ కాలేదు."

ఆ ప్రచ్ఛన్నవ్యక్తి వికటాట్టహాస మొనరించి "అంతేనా! నీచేతఁగాదా! కలహము నీపనికాదా! పాపము మాఁరాజ్య రమానాథుఁ డెంతటివాఁడా!" అని పలికెను.

"వాచాటా! ఊరకుండుము. ఎవరక్కడ వామనా! హరిహరా! రండు రండు."

"ఇరువురేనా! ఇంకను నలువుర, కాదు పదుగురఁ బిలువుము. పిఱికిపందా!"

అంతలో కవాటమును ద్రోసికొని బలిష్టకాయు లిరువురు కృపాణపాణులై లోనఁ బ్రవేశించిరి. వాసంతికను వెనుకకు ద్రొబ్బి యా వనకేసరి కరవాలమును ఝుళిపించెను. రంధ్రములనుండి యగుపడు నయనములు నిప్పుకలఁ గ్రక్కుచుండెను.

ఖడ్గముల సంఘట్టనారవంబు వనకేసరి స్వప్నజనిత తన్మయతనుండి వాసంతికను మేల్కొల్పెను. వామనుని కరవాల మెగిరిపోయి శయ్యాదాపుననుండు విజయాదిత్యు కరముపైఁబడెను. అందులకాతఁడు బాలునివలె కెవ్వున కేకవైచెను. వనకేసరి వామనుని పదతాడనమున క్రిందపడవైచి, హరిహరునిఁ దగిలెను. వారిరువురు కొంతవడి పోరాడిరి. కరవాల ప్రచాలనమున నసమాన చాతురీ ధురీణుఁడగు వనకేసరి వానిఁ గాయపఱచెను. అంత స్వేదబిందు సందోహ

పరివ్యాప్త కపోలుండగు విజయాదిత్యునిబట్టి వాసంతిక కడకుఁ గొనివచ్చి క్షమింప గోరుమనెను. బలవంతమున్నపై నా రాజనామధారి యటు లొనరించెను.

వనకేసరి చటాలున గదిని బాసిపోయెను. వామనుని వాని వెన్నాడఁదెల్పి చాళుక్యపతి యాగదిని వదలెను. గాయంబునఁ గాయంబువివశంబయిన హరిహరుఁడు కొలఁది కాలమునకుఁ బిదప నటనుండి తొలగింపఁబడెను. వాసంతిక మాత్రము విచారానందములలో దేని బొందవలయునని యాలోచించుచు కూర్చుండెను.

---

## తృతీయ ప్రకరణము.



మదాలస రూపవతియని చెప్పియుంటిమి. ఆయమ వివాహమగునప్పటికి, యశోకాయమున నేఁటికిని జీవించి యుండు రాజరాజ విష్ణువర్ధనుఁడు బ్రతికియుండెను. సారంగ ధరుఁడప్పటికి పదునెన్మిది వత్సరములవాఁడు. ఆయమ హృదయమునందాతనిమూర్తి చిత్రింపఁబడియుండినది. వాసంతి కను బాలె యామెను రాజరాజు మోసగించెనందురు. కాని యది విశ్వసనీయముకాదు. సోదర వాత్సల్యమున నటు లొనర్చి యుండినను దోసమన సాహసమగును. ప్రథమకళత్ర వియోగము ననుభవింపలేకుండిన విజయాదిత్యున కంతటి రూపవతిని సమకూర్చినగాని మనోవ్యాకుల మడంగదని యాతఁడొకవేళ తలంచియుండును. ఎట్లైననేమి? మదాలస

యిపుడు రాణియైనది; సంతసములేదు; భర్తృతిరస్కృత ప్రణయయగు టంచులకు నిమిత్తముకాదు. దినదినమున కభివృద్ధియగు మనోవికార మందులకుప్రూట. కర్మభూమి యందు జనించి, పూర్వజన్మకృత కర్మ పరిపాక సమాసాదిత భర్తవలన ఆహ్లాదము పొందకుండు టామెలోపమే. అది యొక్క[illegible]యే కాదు. అధికారవాంఛ యామెకడ సంపూర్ణముగఁ గలదు. భర్త మనోదార్ఢ్యములేని వాఁడగుట నతని ప్రేలిపై ద్రిప్పుచుండెను. నారాయభట్టు సమీపమున లేనపుడాబిడనాథునిపై సంపూర్ణాధికారము కలదగుచుండెను ఎందఱామె కృపవలన నున్నతోద్యోగముల నందిరో దైవమున కెఱుక. ఎందఱుకోపమునకుఁ బాత్రులై యధోగతి నందిరో తెలియదు.

మదాలస విచిత్రాంబరముల ధరించుటయం దాసక్తి కలది. ఒకదినము ధరించిన యంబరముల, భూషణముల రెండవనాఁ డామె ధరింపదు. అందువలన నామె చిత్రాంగి నాబరఁగుచుండినది. మహామంత్రి తన యేలికతోఁ బ్రసంగించునపుడు, చిత్రాంగీదేవియనియే వ్యవహరించు చుండును. ఇఁక రసికాగ్రణి రాజపుంగవుఁడు మదాలసయని యేలపిలచును ?

చిత్రాంగి కాదు-మదాలస తన వేఁడు మాఱుపేరు సార్థకముగునటు చిత్రించుకొని యరుణోదయము కాకమును పే పురోద్యానవాటిక చేరం జనెను. ఆయమ పుష్పాపచయ వ్యాజమున పోవుచుండుటలేదని మాత్రము చెప్పవచ్చును.

రాజపత్ని యచటు చేరునప్పటికి బాలభానుఁడు నిజకర ములచే బ్రకృతిని వియోగ జనిత తాప విదారకముగ స్పృశించుచు దరహాస మొనర్చుచుండెను.

ఆమె పద్మాకరమును డాయునప్పటి కొకయువకుఁ డార్ద్రవస్త్రముల వదలుచుండెను. ఆ తలోదరి యొకవిశాల వృక్షముమాటున దాఁగెను. ఆ యువకుఁడు సముచితముగ నలంకృతుఁడై యొకతరువు నాశ్రయించి యప్పుడుదయించు బాల భానునకు స్వాగత గీతమును వేణువుపైఁ బాడ నారంభించెను. వచ్చిన కార్యము మాని మదాలస నిలచి పోయెను. గానవిద్యాసౌలభ్య మెఱింగిన యాబిడ తన్మయ యగుట వింతకాదు.

అటు నొకటి రెండు గడియల కాలము గడచి పోయెను. ఆ మురళీనినాదమును కుసుమలతికాజనిత సౌగంధావ హారియగు గంధవహుఁ డుత్సుకతతో నాతురతనందనివాఁడై మోసికొని పోవుచుండెను. దానిఁ జాల దూరము గొని పోయెనో, నడుమన వదలివైచెనో విచారించు నవసరము మనకెందులకు ?

మదాలస యిటు సారంగధరునితో మాటాడు జతన మున నరుదెంచి గానమునకు ముగ్ధయై నిలిచి పోయిన దినము లసంఖ్యాకము లనవచ్చును. ఈనాఁడు కార్యసాఫల్యము కానిది వెడలిపోవ నాబిడ సంకల్పము కాదు. మఱియొకసారి ముందున కడుగిడెను. ఆచార్యన న్నపకృత ప్రార్థనాశ్లోకము

నొండతఁడు మధురముగ పాడ నారంభించెను. దాని వినుచు మరల వెనుక కేఁగెను. పదిపదునైదు విగడియల కాలము గడచి పోయెను. ఎట్టకేల కతఁడు తాళపత్రగ్రంథమును గైకొనునప్పటి కతని దృష్టిపథమున నామె పడెను. ఆ యువకుఁడు చకితుఁడై నిలచి, "జననీ! నమస్కారము. వనవిహారమున కరుదెంచితిరి కాఁబోలును" అనెను.

మదాలస మనోహరముగ నవ్వెను. ఆయమ హాసము నకుఁ గారణ మెఱుంగని సారంగధరుఁడు మందహాసమున మోముదామరను మఱింత దర్శనీయ మొనరించుకొనెను. ఒక నిముసమునకు పైగా నటుగడచిన మీద నాయువకుఁడు ప్రశ్నాదృక్కు లతో "ఏలనవ్వుచుంటిరి?" అనెను. మదాలస నవ్వాపుకొని దరహాస జ్యోత్స్న ముఖేందు మండల మరీచి జాలముగ బర్వుచుండ "సారంగధరా! సమవయస్కునకు నన్నటు ప్రబోధించుట విపరీతముగఁ దోఁచినది" యనెను.

"వయ సిందు కారణము గాదు."

"పాండిత్యమా!"

"కాదు. పితృవ్యపత్నిత్వము"

"ఆఁ.......అటులనా మీ పినతండ్రిపై నీకంత గౌరవమా?"

"రాజచంద్రుని సతి యింతటి ప్రాతఃకాలమున నిద్ర మేల్కాంచుట చళుక్యరాజ్యవృద్ధికిఁ గారణమును కొందును"

"భవిష్యన్నృపతి యరుణోదయమున మేల్కాంచుటో"

"జననీ! నాకు రాజ్యవాంఛ లేదు."

"అదేల? విక్రమసిం......" అని నాలుక కఱచుకొనియెను.

"విక్రమసింహుఁడు మా పినతండ్రిని తొలగింపఁ గోరుచున్నాఁడు గాని జననీ! నాకది యిష్టములేదు. మా పినతండ్రి కొన్ని విషయములం దన్యాయముగ ప్రవర్తించుచుండినను మీ సామర్థ్యాదికములఁ జూచియూరకుంటిని."

"ఎంతయుఁ గృతజ్ఞురాలను. సారంగధరా! నా సామర్థ్యమును జూచియేనా?"

"అవును నిస్సందేహముగ"

"పోనిమ్ము. మొన్న మీ పినతండ్రికి వాసంతిక విషయమున బుద్ధిసెప్పిన దెవరు? నీవు కాదా?"

"వాసంతిక యెవరు?"

"పల్లవరాజతనయ. నీకు పత్నిగ రప్పింపఁబడిన సుందరాంగి."

"మీరే పిలిపించితిరా?"

"ఏవరైన నేమి? మీ పినతండ్రి ననుచరులతో శిక్షించినది నీవే కాదా! నిజము దెలుపుము"

"నేనే! పినతండ్రినే! శిక్షించుటయే! మీరు విశ్వసింతురా?"

"అటు లొనర్చుట విశ్వసించుటటులుండ సమ్మతింతునుగూడను."

"మీకు సమ్మతమైనచో నదిధర్మబద్ధమై యుండును. ఆ విషయము వినఁదగినదైన చోఁ దెలుపఁ గోరెదను."

"ఏమియున్నది. వాసంతిక రూపమునకు ముగ్ధుడై యతఁడు బలవంతపఱుపనుండ ప్రచ్ఛన్నవ్యక్తి యాతనిని శిక్షించెను. అయ్యది నీవచేసియుండువని నే నానందించితిని"

"మీ యానందమునకుఁ బాత్రుడ కానందులకువిచారించుచుంటిని."

"సారంగధరా! నిజము. నాయానందము నభిలషింతువా?"

"జననీ! మీ యానందమే నాకు వాంఛనీయము"

"ఆ సంబోధనము మానుము. నను చిత్రాంగీ యని సంబోధింపుము."

"పాపము శాంతించును గాక! నానోట నటులెన్నటికిని రాఁజాలదు."

"అది నాయానంద కారణమైనచో"

రాకొమరుడు నిరుత్తరుడయ్యెను. అతనికామశ్తకాశిని చిత్తవృత్తి సరిగా బోధపడకపోయెను. ఒక్కొక్కప్పు డామదాలస తనను జూచిన చూపులు స్మృతిపథమునందు రానతడు చకితుడై పోవుచుండెను. ఒకంత యవగాహానమైనంత నతఁడు తన యూహ నిరాధారమని తలంచెను. ఎటులేని యామె హృదయము గనుగొన వాంఛలేని వాఁడగుటనతడు సంభాషణాధోరణిని మార్పఁ దలఁచి "మాతా! కుసుమా

పచయమునకు వచ్చితిరి కాబోలును గంధము, రమ్యములగు సుమజాలమును సేకరింతము" అని పలికెను.

"సారంగధరా! నను సంతుష్టి పఱుప నంతగ యత్నింపదలంతువేని సునాయాసముగ —"

"అటుచూడుఁడా పుష్పము భ్రమరము సమీపించియు వదలిపోవుచున్నది."

"అది సంపెంగ"

"మధుకరాంగనల కది భోగబాహ్యముగదా!"

"సారంగధరా! నీయూహ గంభీరమైనది."

"అందలి గాంభీర్యమును గనుగొనఁ గలిగిన మీశక్తి ప్రశంసాపాత్రము."

"మీయభిప్రాయ మంతియేనా?"

"మీరు గ్రహించితిరికదా!"

"సారంగధరా! ఒక యనాగరికుని కడ ననుభవ యోగ్యమగు నట్టిదియు, వాని కెఱుకపడ నట్టిదియు పదార్థము, కాదు సుమ మున్నదనుకొనుము. దానిఁగొని యర్థార్థస్థానమునం దుంచుట రసికునకు గర్తవ్యము కాదా?"

"జననీ! అదేటిమాట. రసికుఁడు వివేకి కావలయు. తన కలభ్యమగు సుమముపై విరక్తి బూనవలయును. ప్రాప్త లాభమును మించి యభిలషించువాఁ డవివేకి."

"నిజముగ బ్రాప్త లాభమును మించిన దనుకొను వస్తువు సులభసాధ్యమైన"—

"దానిపై వాంఛయే లేకుండిన"—

"వాంఛలు కోసివేసికొన వలసినంతటి యావశ్యకత మేమి? మనమేమి కందమూలాదికముల జీవించువారలము గాదుకదా!"

"పోనిండు. ఇపుడా కాకదంత పరీక్షతోనవసరమేమి?"

"నేనుండుస్థితియందే నీవుండిన-సారంగధరా! ఇటుల నీవు విచారింపుము. అసువులైన నీకొఱకు నర్పింపసిద్ధపడి యుంటిని."

"జననీ! మీరిటు నను విషమ పరీక్షయందేల యుంతురు?"

"విషమశరపరీక్షకు లోబడిన నేనేమిచేయును?"

"మీరిటు లాడరాదు"

అతఁడచటు బాయనుండ నాపి,

"సారంగధరా! ఇటువినుము నీ యాకృతిని"

"అమ్మా! వలదెందులకీ వ్యర్థప్రసంగము. వాచాదోషమే యమయాతనల నొసంగును. దుర్వాంఛ మొదటనే రూపుమాపుట సమంజసము."

"ఇది నేఁటివాంఛ కాదు. వత్సరద్వయ మిది నన్నున్మత్తను గావించినది. ఇక నాపరానిస్థితి కరుదెంచితిని."

"అమ్మా! దాని కొక సదుపాయముకలదు. నా యందలి లోపముల మీరు గ్రహింపుడు. ఏవగింపుగలుగు నుపాయము వెదకుఁడు."

"అది సాధ్యమా! సారంగధరా! సోమునికడ నైన లోపము గలదుగాని నీకడనున్నదా! అయ్యో! అదియే కదా! నా యీ మనోవ్యధకుఁ గారణము."

"తల్లీ! క్షత్రవంశ సంజాతుఁడనై పితికి పందనై యుంటిని కదా! చాలదా!"

"అద్దానికి భూతదయ కారణముగదా! ఓయీ! రూపాతిశయ నిమిత్త యువతీ హృదయ చోరా! ఏల యేచెదవు?"

"అమ్మా! అమ్మా! వల దూరకుండుము. ఆవాంఛ నణచి వేయుము."

"నాకు సాధ్యము గాదు."

"తల్లీ! ననుక్షమింపుము." అని యచటు బాసి వెడలి పోయెను.

---

## చతుర్థప్రకరణము.

రాజమహేంద్ర వరమునకు పది క్రోసుల దూరమున నొక పర్వత మున్నది. అయ్యది దుర్గమారణ్యములతో నిండి యుండినది. ఆగుట్టపై నొక కాళికాలయ ముండినది. అట నరబల్యాదులు రహస్యము గనో బాహాటముగనో జరుగుచుండినవి. విజయాదిత్యుని ప్రభుత్వ మారంభమైనప్పటినుండియు నా యరణ్యము రణ సింహుడను చోరనాయకుని యాధీనము నందుండినది. రా

మహేంద్రవరము నుండి కళింగదేశమందలి మహేంద్రగిరికిఁ బోవు మార్గమున పథికులు ధన, ప్రాణములఁ గోలుపోవు చుండిరి. ఎట్లైన నేమి? రత్నసింహాసనము వేంగిదేశమున నాబాల వృద్ధమున కెఱుకయై యుండెను. ఆంధ్రప్రభువు వాని నడంప నెట్టి యత్నములుగాని చేసినటులగుపడదు.

ఒకనాటి ప్రాతఃకాలమున నైదారు గడియలగుసరి కాయడవియందలి యొక వివిక్తప్రదేశమున నొకజనసంఘము విడిసెను. వారు ప్రయాణీకులు గారు. అది వనభోజనమున కరుదెంచిన విజయాదిత్యుని సంఘము. అందు మదాలస వాసంతికా ప్రభృతులగు స్త్రీజనమును సారంగధర ప్రభృతులగు రాజవంగడమువారు నుండిరి. వారిసంఖ్య యిరువదికి పైగానుండును. పరిజనులోక యేబదిమందియు, రథము లశ్వములు నుండినవి. నిర్జనమగు నా ప్రదేశము జనుల కల్లోలముతో నిముసమాత్రమున నిండిపోయెను. రాజ బంధువులగు పురుషులు ప్రకృతినిర్మిత కాసారమున స్నాన మొనర్చుటకో, విలునంబులగొని క్రూరమృగ విదారమునకో బయలు దేఱిరి. సారంగధరుఁడు విశాలమగు మావి వృక్షమునఁడాసి నూతన వేణువు నూద నారంభించెను. పరిజనులు నిజ కర్మలందు నియుక్తులై యుండిరి. మహారాజు విజయాదిత్యుని కై యొకరిద్దఱు వేచియుండిరి.

రాజాంతఃపురజనము మఱియొక కాసారమున, సేవకులచే పరిశోధింపఁబడి, జలకేళికై వెడలిరి. కాని

యూకార్య మారంభింపఁబడలేదు. మదాలసా వాసంతిక లడవి జాతి సుమముల సేకరించు వ్యాజమున వెడలిరి. వారల నెమకుచు నితర స్త్రీజన మిటునటు తిరుగుచుండెను. వానిన వారిహారులు పురినుండి యరుదెంచి మహారాజుగారు రాజ కార్యపు టవసరముబట్టి రావీలులేదని తెలిపిరి. అటనుండినది పరివార మేయగుట విచారముకాని, యానందముకాని వ్యక్తపడదయ్యెను.

సారంగధరుడేదియో పద్యమును బ్రకృతిపై గాఁబోలు రచించుచుండెను. అంతలో వెనుక నేదియో శబ్దమయ్యెను. ఆతఁడు చకితుఁడై వెనుదిరిగెను. వనలక్ష్మి ద్విరూపయై వచ్చెనా యని నటుల మదాలసా వాసంతికలట ప్రత్యక్షమైరి. సారంగధరుడు తెచ్చికోలు దరహాసముతో వారలకు చూపు లతో స్వాగతమొసంగెను. వారాతని డాసి యొక యున్నత శిలపై నధిష్ఠితలైరి.

" సారంగధరా! మొన్నటిదిన మటు హటాహటిని వెడలిపోయితివి. నీ వేణువు నటనేవైచి వెళ్లితివి. అది నీకొసంగ నీనాలుగు దినములనుండి యత్నించితిని గాని ఫలము లేకపోయెను."

" మీరద్దానిపై గాన మొనర్తు రనుకొంటిని. మీకడనే యుండనిండు. నే మఱియొకటి జేసికొంటిని."

" అయిన నిది నేనే గైకొందునా?"

" నే ధన్యుఁడనని తలంతును."

“ రాకొమారా ! నను సంతోషపఱుప నెందులకింత యత్న మొనరించుచుంటివి ? ”

“ తల్లుల సంతృప్తిపఱచుట పిల్లల బాధ్యతకదా ! ”

“ అబ్బా ! మరల నా దండకమే ? ఇదిగో వాసంతిక ! నీ వానాడు రక్షించిన దీ సుందరాంగినే ! ”

“ నా కెందులకా ఘనత. రాకుమారీ ! మా పిన తండ్రిని వరింపని కారణము ? ”

వాసంతిక లజ్జావనతవదనయయ్యెను. ఆయమ సారంగ ధరుని తనివితీర జూడ గలిగి నందుల కెంతయేని సంతోష పడుచుండినది.

“ రాకుమారా ! ”

“తనయా! యనుడునా కెంతయు సంతసముగలుగును”

“సారంగధరా ! నీతో మాటాడ నెంచిన నన్నెందుల కిటు లవరోధించెదవు ? ”

“ నే నవరోధించుటే ! మాతా ! అదేటిమాట. మీ సంభాషణమునకే నెపుడు నెదురుచూచుచుందును.

“ అది యుండనిమ్ము. నీ పినతండ్రి కెందరు భార్య లుండవలయునని యెంతువు? ”

“ ఎందఱేని యుండవచ్చును. ”

“ ఎందులకు ? ”

“ రాచకార్యముల నిమగ్నులగువారి కనేక ప్రియ లుండుట మనశ్శాంతికరము. ”

"అందులకొక గ్రంథమును వ్రాయకపోయితివా ?"

"తండ్రిగారి యాజ్ఞయైన నటులే యొనర్తును"

"నీవెందఱ వివాహమాడుదువు ?"

"అమ్మా ! పిఱికిపందకు వివాహమెందులకు ?"

"ఎవరని" మృదుమధురముగ వాసంతిక యొక క్రీగంటిచూపు విసరుచు ననెను.

అందులకు సారంగధరుఁడు దరహాసముఖుఁడై

"రాకుమారీ! పురమం దెవరినడిగినను తెలుపుదురు."

"రాకొమరునకు సేన, సేనాని సహాయముండ నేమి కావలయును ? రసికత యువతీ, మానసాపహారణక్షమంబగు సౌందర్యగరిమ యుండవలయును."

సారంగధరుఁడు బిగ్గఱగ నవ్వి "అమ్మా! ఏమి మీఁ వాత్సల్యము ? నన్నెటులేని గొప్ప సేయుచుంటిరి. మీరు తెలిపిన రెండుగుణములు శత్రురాజుల నెదిరింపఁజాలవు."

"అమ్మా ! యను సంబోధన మొక్కటి యాపివేయరాదా ! నిను వేడుకొందును."

"అయ్యది విధేయతను జూపదా" అని వాసంతిక మరల యొక హాసముతో ననెను. మదాలస తీక్షణవీక్షణ మొకటి బఱపెను. రాకొమరుఁడది చూచియు జూడనటు లుండెను. మదాలస యేదియో పలుక నోరుదెఱచెను.

అంతలో బలువు రబల లఱచినటు వినబడెను. ఆముగ్గు రటుచూడ నొక స్త్రీమూర్తి నీటిపై కరుదెంచి మరల

మునిఁగెను. రాకుమారుని కదేమని గోచరించిన మాత్రమున తటాలున వారల వదలి పఱువిడి యా కాసారమునందుఁ జొచ్చెను.

ఆతఁడు మునిఁగి పదునైదు నిముసములు గడచెను. బుద్బుదచయ మొండె యాజలోపరిభాగమునఁ గాన్పించుచుండెను. ఆవలిభాగమందలి స్త్రీజనమును నీవలి రాజపుత్రికాద్వయమును నిశ్చేష్టులై నిలచియుండిరి. మదాలస వృద్ధాంగియు, ప్రౌఢయు గాకపోయినచో మూర్ఛిల్లి యుండెడిదే! వాసంతిక తీరమునఁ గూలఁబడి యుండినది. ఆమె ముఖము తెల్లబాఱియుండెను. ఆ గుండెలు దడ యెట్టి వారికేని విననగుచుండెను

అంతలో నా రాకుమారుఁడా నీటమునుఁగిన బాలికను నడుముబట్టుకొని యెత్తి యొకింతవడికి శిరమును నీటిపైకిఁ బెట్టి వాయువును నాసికారంధ్రములనుండి తీసికొని యచేతన యగు బాలికను మూఁపునఁ ధరించి యొకచేత నీదుచు నా స్త్రీజనమున్న వైపునఁ కేఁగెను. వాసంతిక నయనములు త్తేజితములై పోవుచుండెను. మదాలస యానందము వర్ణింపరానిది. వాసంతిక యటపడియుండిన వేణువునుగొని ముందా తీరమునుఁగూర్చి పరుగిడ నారంభించెను. మదాలస నీటదుమికి యాతీరమును ముందుగాఁ జేరెను. రాకుమారుఁడు "మీరటుచేసియుండరా"దని యా యచేతనయగు బాలికను సచేతన నొనర్ప యత్నములు సేయుచుండెను.

ఇంతలో వాసంతిక రోజుచు నట కరుదెంచి "రాకుమారా! ఇది మా దేశమున భీరువులొనర్చు పనికాదు" అనుచు మనోభావమునంతయు వెడలఁగ్రక్కెను. ఆ బాలిక యొక్కింత చైతన్యముఁ బడయునంతలో నశ్వముల డెక్కల శబ్దము వినవచ్చెను. వారిజాక్షులు వారిజములఁ బోలు ముఖములటు ద్రిప్పిరి

నిసిత కరవాల పాణులగు ననుచరులతో రత్న సింహుఁడు సాక్షాత్కరించెను. అతఁడు భీకరాకారుఁడనిన చాలదు. ముఖమంతయు శ్మశ్రుపరిశోభితమై యుండెను. పై పెదవి చిన్నదగుటవలన దంతము లగుపడుచుండినవి. విశాలమగు వక్షమునకు శార్దూలచర్మము కట్టబడియుండెను. తలపాగయు, కట్టుబట్టయు, రక్తిమములై యుండినవి.

వాని యనుచరు లిరువదిమంది యుండిరి. వారును రక్తాంబరధారులై యుండిరి. వారిఁ గాంచినంత నార్ద్ర వస్త్రము లనియైన గణింపక రాకుమారుఁడు కెవ్వున నఱచి యటనుండి పలాయితుడయ్యెను. వానివెన్నాడ నిరువు రాశ్వికులు వెడలిరి. కాని యాతఁడొక యున్నత ప్రదేశము నుండి దొరలినటులఁ జూచి యసువులఁ బాసి యుండునని తమ నాయకునితోఁ జెప్పిరి. ఆ మదవతుల యలబలము కాని చోరుల యమానుష క్రూరతగాని వర్ణింపనేల? వారిజాక్షుల నందఱ బంధించి యశ్వముల నెక్కించి వారు ప్రక్కన నడచుచుండిరి. వారు బంధితులై వృక్షములకుఁ గట్టబడిన

చళుక్య పరివారమును సమీపించినంతన మదాలస విషయ
మును గ్రహించెను.

"ఓరీ! నన్నెవరినిగాఁ దలంచితివి. తక్షణమె మము
విడువకుండిన సైన్యసహాయ మింతలో నరుదెంచి నిను
మట్టుపెట్టును" అని గంభీరముగ, క్షాత్రవంశోచితముగఁ
బలికెను.

రత్నసింహుఁడాపెను దరహాసముచే మరింతవికారముగు
చూపుతోఁ జూచి "ఓరీ! అభీరుఁడగు రాకొమరుని
యసువులతోఁగాని నిర్జీవునిగఁ గాని పట్టుకొనిరండని యట
నొకచో విశ్రమించి బంధిత వనితాలోకమును కాముక
దృక్కులతోఁ జూడ నారంభించెను. మదాలస మాత్రము
రక్తారుణితనయనయై చుఱచుఱఁ జూచుచుండెను. ఇతరు
లవనతివదనలై యుండిరి.

అటులొక పదునైదు నిముసములు గడచునంతలో
నైదారుగురు రాజబంధువులు పదుగురు చోరులచే బంధింప
బడి కొనిరాబడిరి. బంధితులగు వనితలఁ జూచినంత వారి నయ
నము లరుణములయ్యెను. బంధిత కిశోరము లేమి చేయగలవు!
వారి పరుష భాషణము లాగకముందే మరల నశ్వపద
ఘట్టనము వినవచ్చెను.

అట నరుదెంచున దెవ్వరును గాదు. మన వనకేసరి.
ఆ యున్నతాశ్వము నధిరోహించిన యా వీర పురుషుఁడు
దర్శనీయుఁడై యుండెను. తూణీరద్వయ బాణాసన పరికల్పిత

సౌందర్యాతిశయాకృతి నటనున్న వనితాజన మొకపరి చూడఁజాల కుండలేక పోయెను. కరవాలము వెలుపలకుఁ దీయబడినదై వల్మీక వినిర్గతాశీవిషంబుబలె విరాజిల్లు చుండినది.

నయనముల నుండి యగ్నికణంబు లురల నతఁడు "ఓరీ! ఇంటిపట్టు జూచుకొని మొటుగు గ్రామ సింహము నీకంటెను మేలుకదా? అబలలఁ బట్టగలిగితినని గర్వించితివి కాఁబోలును. నీచా! నీపై కత్తి నెత్తుటయు న్యూనత యనిపించెడిని."

రత్నసింహుఁడు ప్రత్యుత్తరము నొసంగ డయ్యెను. అటనుండి నిలచి ఖడ్గమును దెఱకెను. వనకేసరి యశ్వమునుండి దుమికి వాని కరవాలము నూడఁగొట్టెను. దృఢతరముగఁ బట్టుకొనిన కైదువెటు లంతలో నూడిపోయెనా యని విచారించు లోపల నా యువకుని ముష్టిఘట్టు తాకుట నా చోరనాయకుఁడు క్రింద పడియెను. కనుమూసి తెఱచు నంతలో వనకేసరి యితరులపై కేగెను. వారు సంసిద్ధులై యుండినను పరాక్రమాతిశయముగల నాయకునిపాటు చూచి నివ్వెఱనందియుండుటను వనకేసరి నెదిరింప సాహసింపరైరి. కాని యాతని కరవాలమునకు నిజకరవాల మడ్డు నొడ్డుటగాని, యందువలన క్షతగాత్రు లగుటగాని వదలని వారైరి. ముప్పదుగురు చోరులలో పదుగురు నేల నలంకరించిరి. పదుగురకు పైగా పలాయన మంత్రము పఠించిరి. రెండు గడియలకాలము గడచిపోయినది.

మిగిలినవారు కోప మంతకంతకు ముప్పిరిగొన నొక్కింత దీవ్రముగ ననువులపై నాసవదలి పోవుచుండిరి. రత్నసింహుఁడు చిన్నగా లేచి కరవాలహస్తుఁడై వెనుక పాటున నరుదెంచెను. మదాలసా వాసంతికలు హెచ్చరిక నిచ్చునంతలో వాఁడు బలముగ కరవాలముతోఁ గొట్టెను. వనకేసరి యొక్క కంట కనిపెట్టుచుండుట నావాలుమీఁద పడబోవు నపుడు ప్రక్కకు దొలఁగి ఖడ్గపతన వేగమున వ్రాలిన వాని వీపును పిడికిట పొడచెను. చోరనాయకుఁడు క్రిందపడుచు తన పరివారములో నొకఁడు వనకేసరిపై విసరిన చుఱియ కంఠ సమీపమున గ్రుచ్చుకొన రక్తసిక్తాంగుఁడై క్రింద పడియెను. అప్పటికి జీవితముతోనున్న నలుగురు పరుగిడిరి.

రత్నసింహుఁడు వనకేసరిని జూచి యవసాన దశ వచ్చినదని తెలుపుచు తనకడ నుండిన యొక తాళపత్రము నొసంగెను. అయ్యది గాంచిన వనకేసరి స్తంభితుఁడై పోయెను.

"ధర్మదేవతా! నీవెటదాగితి" వని మదాలస కట్లను విప్పి యామెకా పత్రము నొసంగి యశ్వారూఢుఁడై యథేచ్ఛఁ జనియెను.

మదాలస మనోభావము వర్ణనకతీతమై యుండెను. ఆ మాయయొకరిద్దఱకట్లను విప్పి రాజధానిఁగూర్చి ప్రయాణము కానాజ్ఞాపించెను. అంత నొకరిద్దఱు సారంగధరునకై వెదకి యొకగుల్మమునందు పంకిత శరీరుఁడై చిక్కుకొని యుండుట

గాంచి వడకెడు స్థితియందుగొనివచ్చిరి. అందఱును పయనము సాగించిరి. వాసంతిక చిత్రపటము నొకదానిఁజింపి పార వైచెను.

ఇటఁ గథాధోరణినాపి యాంధ్రదేశచరిత్ర నొకింత చదువరుల కెఱుక పఱుపవలసిన బాధ్యత యున్నది. ఆంధ్ర దేశచరిత్ర సమగ్రముగ లేదు. అందు చాళుక్యులు కాకతీయు లాంధ్రావని నాక్రమించు నంతవఱకును బాలించుచుండిరి. వీరేడవ శతాబ్దాదినుండి పదుమూడవ శతాబ్దమధ్య కాలము వఱకును మనభూమినిఁ బాలించిరి. వీరినిగుఱించి యెఱుంగు టకుముందు వీరికి మూలపురుషులగు పశ్చిమ చాళుక్యుల గుఱించి కొంత తెలిసికొను టనవసరము కాదు.

చాళుక్యులు చుళుకమునుండి పుట్టినవారగుట నటు పిలువంబడిరట. వారు నాలవ శతాబ్దమున ప్రస్తుత బొంబయి రాష్ట్రమందలి యుత్తరభాగమును నైజాము రాష్ట్రమునందలి కొంతభాగమును నాక్రమించియుండిరి.

రాజపుత్రస్థానము నందలి రాథోడులు వింధ్యనుదాటి చాళుక్యుల రాజ్యపరిసరముల కధికారులై యుండిరి. వీరు క్రీస్తుశకారంభము నుండియే వచ్చియుండిరని చరిత్ర చెప్పు చున్నది. వీరె రెండు శతాబ్దములలో చాళుక్యులను సామం తులుగ నొనర్చుకొని యుండిరి. సామంతులైన చాళుక్యులు వాతాపినగరమునందుండిరి. రాథోడులు రాష్ట్రకూటు లనఁ బడుచు మయూరఖండిని ప్రధానపట్టణముగ నేర్పఱచుకొని యుండిరి. ఇది ప్రస్తుత నాసికమండలమునందుండినది.

క్రీ. శ. 550 ప్రాంతములం దీ రాష్ట్రకూటు లుత్తర హిందూస్థానము నందలి రాధులతో కలహించుటంబట్టియు నంతః కలహముల నందియుండ, నిజ రాజ్యమును బోగొట్టుకొను స్థితియందుండిరి. అట్టిచో వాతాపియందుండిన జయసింహుం డదను నెఱిగి పౌరుషాతిశయమును బ్రకటించి సర్వరాజ్యమును లోబఱచుకొనియెను. ఇతని తనయుఁడు కీర్తివర్మ జనకుని విజయముల సంపూర్ణమొనర్చి చాళుక్య రాజ్యము సుస్థిరమొనరించెను. ఈభూపాలుని యనంతరము ప్రథమ పులికేశనుఁడు రాజ్యభారము వహించెను. ఇతఁడు సత్యాశ్రయాది బిరుదములవహించి పెక్కు ప్రదేశముల చాళుక్యరాజ్యరమ వీక్షణములోనికిందెచ్చెను.

క్రీ. శ. 567 ప్రాంతమున కీర్తివర్మరాజై చతుర్వింశతి వత్సరములు ధరాపాలన మొనరించి యుత్తర కొంకణ కర్ణాటక దేశముల దన యాతపత్రమునకు లోఁబడఁజేసెను. ఇతని యనంతరము దురాశాపీడితుఁడగు మంగళేశుఁడు రాజ్యము నాక్రమించెను. ఇతఁడు పరాక్రమవంతుఁడు. పెక్కు యుద్ధములొనరించి యశము నొందెను. తదనంతరము క్రీస్తు శకము 611-34 వఱకును చాళుక్యరాజ్యరమ పరాక్రమశాలి యగు ద్వితీయ పులికేశి యధీన య య్యెను. ఈతఁడు చక్రవర్తినాఁ బఱఁగెను. వనవాసి రాజధానిగనేలు కాదంబులను లోబఱచుకొనెను. గాంగులు, అలుపులు కప్పముగట్ట నొప్పుకొనిరి. కొంకణము మాళవ ఘూర్జరముల నితఁడు జయించెను. శ్రీహర్ష సార్వభౌము నర్మదాతీరమున నోడించి

యశోవిరాజితుఁడయ్యెను. ఇతఁడు దా నందిన విజయములతో దృప్తినందక పల్లవుల జయించి వేంగీదేశము నాక్రమించెను. ఆ నూతన సంపాదిత భూమికి తన సోదరుఁడగు కుబ్జ విష్ణు వర్ధనుని క్రీ. శ. 612 సంవత్సరమున బౌద్ధుల యధీనమున నుండు వేంగీపట్టణమున నిలిపెను.

కాని పల్లవులు వేంగీదేశమును గోలుపోయినందునఁ గలిగిన యవమానమును సహింపలేక నరసింహవర్మ నాయకత్వమున వాతాపి నాక్రమించి దాని దహించివైచిరి. రాజాధిరాజ పులికేశి మరణించెను.

అటు తరువాత చళుక్యప్రభువులు క్రీ. శ. 750 వఱకును పల్లవులతో బోరుచునే యుండిరి. జయాపజయములు క్రమముగ కలుగుచునే యుండెను. కీర్తివర్మ యుద్ధముల వలన బడలినవాఁడై సేనానులలో సమర్థుఁడు రాష్ట్రకూట వంశస్థుఁడునగు దంతిదుర్గునకు నధికారమొసంగుట నాతఁడు సమయ మదియని చాళుక్యరాజ్యమును స్వాధీన పఱచుకొనియెను.

సోదరుని మరణానంతరము వేంగీదేశ పాలకుడగు కుబ్జ విష్ణువర్ధనుఁడు స్వతంత్రుఁడయ్యెను. అప్పటినుండియువీరు పూర్వ చాళుక్యులనియు, పశ్చిమ చాళుక్యులనియు వ్యవహరింపబడుచు వచ్చిరి. కుబ్జవిష్ణువర్ధనుని సంతతివారు రాష్ట్రకూటు లొనర్చిన యన్యాయమునకు పలుమారు దండెత్తి వారి నోడించిరిగాని తమవారి యౌన్నత్యమును ప్రతిపాదింప

జాలకపోయిరి. రాష్ట్రకూటులు రెండున్నర శతాబ్దముల రాజ్యపాలనమును నిరంకుశముగ సాగించిరి.

## పంచమ ప్రకరణము.



క్రీ. శ. 977 ప్రాంతమున మొదటి జయసింహునివలె తైలపుఁడను శూరశిఖామణి చాళుక్యరాజ్యమును మరల స్థాపించెను. గుజరాత మొకటియే యితనికి లోఁబడలేదని చెప్పెదరు. మాళవము నితఁడు జయింపఁగోరి తద్రాజ్య రమానాథుఁడగు ముంజునితో పోరి యోడిపోయెను. దైవోపహతుఁడగు నా ముంజభూపతి నది నుత్తరించుచుఁ జిక్కి మరణించెను. అంత నితనికి ప్రాగ్భాగమందలి చోళులతో విరోధము పొసగెను. ఇతనికిఁ బిదప నరుదెంచిన సత్యాశ్రయుఁడు విక్రమాదిత్యుఁడు జయసింహుఁడును చోళులతోఁ బోరాడుచునే యుండిరి. జయసింహుని కుమారుఁ డాహవమల్లుఁడు 1040-69 వఱకును చళుక్యులఁ బాలించుచు చోళదేశము నేలు రాజాధిరాజుతో వైరమూని యుండెను. ఇతనికి సోమేశ్వరుఁడనియు విక్రమాదిత్యుఁ డనియు నిరువురుతనయు లుండిరి. వీరిని గుఱించి ముందు వ్రాయబడును, గాన పూర్వచాళుక్యుల గుఱించి కొంత తెలిసికొందము.

పై జెప్పినటుల కుబ్జవిష్ణువర్ధనుఁడు మూలపురుషుఁడుగ నేర్పడిన పూర్వచాళుక్యులు రాష్ట్రకూటులతో విరోధము

కలిగియుండిరి. వీరికి పల్లవులవలన బాధయంతగ లేకుండినది. ఉత్తరమునం దుండిన కళింగులతోఁ గూడ వీరు మైత్రి పాటించుచుండిరి. అందువలన నూతన స్థాపితమగు చళుక్య రాజ్యము సుస్థిరమైపోయెను. వీరు వేఁగీదేశమును వేంగి పట్టణము రాజధానిగ నొనర్చుకొని పాలింపసాగిరి.

కళింగమందలి కొంతభాగము వీరికి ప్రాప్తించుటం బట్టి పదునాలవ నృపతి అమ్మరాజు విష్ణువర్ధనుఁడు రాజధానిని మార్చెను. క్రీ. శ. 918-25 వఱకును బాలించిన యీతఁడు రాజమహేంద్రుఁడను బిరుదమును గాంచియుండెను. అద్దాన గోదావరీతీరమునందు నూతనముగ నిర్మితమైన పురము నకు రాజమహేంద్రవరమని పేరిడిరి. అప్పటినుండి క్రీ. శ. 1072 ప్రాంతము వఱకును పూర్వచాళుక్యుల కిది రాజ ధానియై మహావైభవోపేతమై యుండినది.

పశ్చిమచాళుక్యులు మరల నున్నతస్థితి కరుదెంచిన పిదప పల్లవులతోఁ గలహించుటమాని చోళులతోఁ బోర నారంభించిరి. ఆసమయమునందు పూర్వచాళుక్య నాయకుఁ డును నిరువదియొకవ రాజునగు కీర్తివర్మ (1003-1015) చోళనాయకుఁడగు రాజరాజుతో సఖ్యమొనర్చెను. అందు వలన చోళులు పశ్చిమచాళుక్యుల నోహటింపవెనుదీయరైరి. మన పూర్వచాళుక్యుల వర్తకవిషయమునందు ముందంజ వేసిరనుట ఆసాము, అరకాను దేశములందు వీరి నాణెములు లభించుటయె ప్రబలసాక్ష్యము నొసంగుచున్నది. ఈకీర్తివర్మ బంగారునాణెము లట గనుగొనఁబడినవి.

కీర్తివర్మ తన సోదరుఁడగు విమలాదిత్యునకు రాజరాజు తనయను కుండవాంబాదేవిని వివాహమొనర్చెను. అద్దాన నీ రెండు రాజ్యములు దృఢతరమైత్రి కలవై యుండెను.

వీరిరువురకు మధ్యనుండు పల్లవులు విరోధభావము మానక సౌమనస్యతతోఁ గాలము గడుపుచుండి, ఒకవేళ నిట్టి సంబంధము నభిలషించి యది వ్యర్థమగుటను గాబోలు పశ్చిమ చాళుక్యులు చోళులతో గలహింప మానరైరి. ఏదియెట్లున్నను చోళపతితనయను విమలాదిత్యుఁడు వివాహమాడబట్టియే మన యాంధ్రభారత కృతిపతిజన్మ మాంధ్రదేశమునం దయ్యెను. విమలాదిత్యుఁడు తన మామగారి నామమును దనయునకుఁ బెట్టెను. అందువలన నతడు రాజరాజ విష్ణువర్ధనుఁడనియు, రాజరాజ నరేంద్రుఁడనియు వ్యవహరింపబడుచుండెను. ఇతని సోదరుఁడు విజయాదిత్య విష్ణువర్ధనుఁడు. అతని పరిచయము చదువరుల కొసంగబడెను.

క్రీ. శ. 1015-1022 వఱకును విమలాదిత్యుఁడు ధరాపాలన మొనర్చి యువకుఁడగు విజయాదిత్యుని రాజరాజు నధీనమున నుంచి లోకయాత్ర చాలించెను. రాజరాజు మాతులుఁడగు రాజేంద్రచోళుని తనయను అమ్మంగదేవిని వివాహమయ్యెను. నాటినుండియు సోదరులకు వైమనస్యమారంభమయ్యెనుగాని భీరుఁడగు రాజసోదరుఁ డేమియుఁ జేయలేకుండెను. ఈ రాజరాజు 1022 సంవత్సర మాగస్టు పదునాఱవ తేది తన ప్రభుత్వము నారంభించెను. అతడు

ప్రభుత్వమునకు వచ్చిన పదిసంవత్సరముల కా రాజచంద్రునకుఁ బుత్రోదయ మయ్యెను.

పూర్వచాళుక్యులలో నిరువదియొకటవ పురుషుఁడగు యుద్ధమల్లుని కాలమునందే తెనుఁగు పద్యరచన వ్యాప్తిలో నుండెనని యాతని దానశాసనములవలన దెలియనగును. క్రీ. శ. 843-844 లో రాజ్యపాలన మొనర్చిన యైదవ విష్ణువర్ధనుని కాలమునందు శాసనము లాంధ్రమున వ్రాయబడెను. కాఁబట్టి మనభాష యేడవ, ఎనిమిదవ శతాబ్దములందు వ్యవహారమునందుండెనని యూహింపవలసి యున్నది. ఏది ఎటులున్నను తొమ్మిది, పది శతాబ్దములందు పద్యరచన బహుళమై యుండవలయును. అందువలన నాభాష పండితులు, సంస్కరింపదగియున్నదని పదవశతాబ్దాంతమునందు దలంచి యుందురు. అందున ప్రథమాచార్యుఁడగు నన్నపార్యుఁడు 1048 వ వత్సరమున శబ్దానుశాసనమను గ్రంథమును రచించెను. శాస్త్రములు జనులు దనకడ నుండిన విద్యార్థుల కది పాఠము సెప్పియుండెను. రాజరాజు తనయుఁడు కులోత్తుంగుఁడను నామాంతరము గల రాజేంద్రచోళుఁడును నన్నపార్యునికడ విద్యార్థియై యుండెను. ఆచార్యులవారు సహజజ్ఞాన పరిశోభితుఁడగు నా రాకొమరునకు శబ్దానుశాసనమును పాఠము సెప్ప నారంభించెను. రాజసుతుఁ డేకసంతగ్రాహి యగుట నత్యంత సులభముగ వ్యాకరణము నభ్యసింప సాగెను. అది గాంచి యాచార్యుఁడు మహేశ్వరు నంతటి

వ్యాకరణశాస్త్రజ్ఞానము గలవాఁడని తలంచియో యాతని వంశమున కాదిపురుషుం డతఁడు దలపించెడు ననియో సారంగధర శబ్దమున బిలువసాగెను. అంతఃపురమునందును రాజకీయ వ్యవహారమునందు ప్రవేశముగలవారి సంఘము నందును రాచబిడ్డఁడు సారంగధరుఁడనియే పిలువఁబడు చుండెను. 1050 ప్రాంతములందు శబ్దానుశాసనమునందు పెక్కురు సుశిక్షితులౌట జరిగెను. ఇందులకుఁ గారణ భూతుఁడు రాజరాజనరేంద్రుఁడు. ఆ రాజచంద్రుఁ డాంధ్ర భాష నభివృద్ధినొందింప బద్ధకంకణుఁడై యుండెను. భాష క్రమశిక్షితమైనంత కావ్యావశ్యకత యా భూనాథునకు దోఁచెను. బౌద్ధమత మొకప్పుడిట వ్యాప్తియందుండినది. బ్రాహ్మణమతాభిమానియగు నీ నృపశేఖరుఁడు తత్సంబంధ గ్రంథము లుండిన బాగుండునని వ్యాసభారతమును దెనిగింప నాచార్యుల హెచ్చరించెను. నారాయణభట్టు అథర్వణా చార్యాదులగు పండితపుంగవులుండ తనపై నభిమానంబు హెచ్చ నడిగెనని తలంచి యందులకుం గడంగెను. ఆ విషయమునకుఁ బండితసంఘ మిాద్యాసక్తము కాకపోలేదు. వారును నిజవిద్యావైశారద్య ప్రకటితమగునటు లందందు కొన్ని భాగములనో, కొన్ని పర్వములనో యాంధ్రీక రించిరి. లక్షణగ్రంథము వ్రాసిన యా యాచార్యవర్యు గ్రంథము ప్రశస్తికరుదెంచెను.

రాజరాజవిష్ణువర్ధనుఁడు 1051 వత్సరమున రాజేంద్ర చోళుని సోదరుని హస్తములందుంచి ముంజుని సమ్మాన

సింధిలునివలె దివంగతుఁడయ్యెను. ఆచార్యవర్యుఁడు నన్న పార్యుఁడు సర్వోత్సాహముల గోల్పోయిన వాఁడయ్యెను. చిత్తమున్మత్తమైపోయెను. సర్వవిధ సత్కారములు గావించు ప్రభుసత్తముఁడీ పృథివి వదలిన నాలుగైదు మాసములలో పర్వాత్రయాంధ్రీకరణ మొనర్చి నాకలోకమున తనయేలికను జేరబోయెను.

విజయాదిత్యుని ప్రభుత్వము వత్సరము గడచులోపల నతనికి కపటతంత్ర విశారదుండగు నారాయణభట్టు మంత్రిత్వమును రాజేంద్రునుండి రాజ్యమును గైవసమొనర్చు కొనునభిలాషయు మించెను.



## షష్ఠమ ప్రకరణము.

పూర్వచాళుక్యుల రాజ్యము సింహపుర ప్రాంతముల వరకు వ్యాపించి యుండినది. అటనుండి కంచి వఱకును పల్లవుల పాలనముండెను. అంతకు దక్షిణదేశమును చోళులు పాలించుచుండిరి. వీరు ఉరయ్యూరు ప్రధాన పత్తనముగ ధరాపాలనము నొనర్చుచుండిరి. వీరు సూర్య వంశజులని చెప్పుకొనుచుఁ జంద్రవంశజులగు చాళుక్యులతో సంబంధము నొనర్ప సమ్మతించిరి.

క్రీ. శ. 98౫-1013 వఱకును చోళదేశమును రాజరాజు పాలించుచుండెను. ఇతనికి రాజేంద్ర చోళుఁడను తనయుఁడును, కుందమాంబయను తనయయు నుండిరి. ఈ కుందమాంబను కీర్తివర్మ తనసోదరుఁడగు విమలాదిత్యునకు

వివాహ మొనర్చెను. రాజేంద్రచోళుఁడు పూర్వచాళుక్యులతో సఖ్యసంబంధములు గలిగియుంట పశ్చిమ చాళుక్య నృపతియగు విక్రమాదిత్యునకు (1008-40) సంకట ప్రాయముగనుండెను. అద్దాన నతఁడు నిష్కారణముగనే చోళులపై నాహవ మొనర్ప తలంచెను. ఆరాజు తలంచిన విరోధకారణము వలయునా! గాంగుల భూమిని కొంత యాక్రమించిరను నెపమున సోదరుఁడగు జయసింహుని నపరిమిత సైన్యసమేతు నొనర్చి గాంగులకు సహాయుపడ నాజ్ఞాపించెను. 1035 ప్రాంతములనుండి చోళ పశ్చిమ చాళుక్యులకు తీరని వైరము సంప్రాప్త మయ్యెను.

విజయసింహుని కాలమంతయు నిష్ఫలవైరముతోడనే గడచిపోయెను. 1040 లో యాతని తనయుఁడు సోమేశ్వరుఁడు పెదతండ్రి రాజ్యమున కధినాథుఁ డయ్యెను. ఇతఁడొక పది వత్సరములు జయాపజయముల నందుచు జన, ధన వ్యయము గణింపక పోరుచుండెను. పూర్వచాళుక్యులకు నాయకుఁడైన విజయాదిత్యుని మనోభావముల నెఱింగినవాఁడును, తంత్రావాపసమర్థుఁడునగుట నాహవమల్ల బిరుదాంకితుఁడగు ప్రథమ సోమేశ్వరుఁడు అతని రాయబారి నంపి తనవైపు త్రిప్పుకొనెను.

అప్పటికి చోళరాజ్యము రాజేంద్రునిచే పాలింపఁబడుచుండెను. ఈ నరనాయకునకు రాజాధిరాజు, రాజేంద్రుఁడు, వీరరాజేంద్రుఁడు నను ముగ్గురుపుత్రులును, అమ్మంగ దేవియను

తనయయు నుండిరి. అమ్మంగ దేవి రాజరాజున కొసంగబడెను. క్రీ. శ. 1013-1042 వరకును రాజ్యభారము వహించి యతఁడు లోకయాత్ర చాలించెను. అతని జ్యేష్ఠతనయుఁడు రాజాధిరాజు 1012-1052 వరకును ప్రజాపాలన మొనర్చుచు నాహవమల్లు నోహటించుచుండెను.

ఆహవమల్లుఁడీ నిష్ఫలసమరము నంతమొందింపదలచి విజయాదిత్యుని సహాయమును గోరెను. పూర్వచాళుక్య నృపతి యపారసైన్యముతో విక్రమసింహుని సహాయపడ నంపెను. విక్రముఁ డసమ్మతితోఁ దనయునితోఁ బోయి పశ్చిమ చాళుక్యులతోఁ గలిసెను. అపారమగు నీవాహిని తనపై వచ్చుచుండుట నెఱింగి రాజాధిరా జుచితసేనతో బయలు దేరి కొప్పమనుచోట ప్రత్యర్థి నెదుర్కొనెను. పోరు ఘోరముగ జరిగెను. ఇరువాగులవారికిని సైన్యనష్టము కలిగెను. పూర్వచాళుక్య సేనాని విక్రమసింహుఁడును రాజాధిరాజును ద్వంద్వయుద్ధ మొనర్చుచు మడసిరి. ఎవరి సహాయము రహస్యముగ నభిలషించి సారంగధరునకు మేలు సేయదలంచెనో వారినే యోహటించి హత మొనర్చి విక్రముఁడు హతుఁడయ్యెను. విధికార్యము లెంతటి గభీరము లైనవి ! ఈవిషయములు 1052 వ సంవత్సరాంరమున జరిగినవి. హతశేషమగు సైన్యముతో విజయసింహుఁడు రాజమహేంద్రవరమునుం జేరెను.

రాజాధిరాజు సోదరుఁడు రాజేంద్రుఁడు. తన పితామహుఁడు రాజరాజు పశ్చిమచాళుక్యుల ముప్పుతిప్పలు

పెట్టి మూఁడుచేఱులనీరు త్రాగించిన విషయము దలంచి సముచిత సైన్యసమేతుఁడై యెదిర్చి, యాయరిబలమునుతేఱిమి వైచెను. అంత నొకటిరెండు మాసములెట్టి యుద్ధప్రయత్నములుగాని జరుగకుండెను. వాహినీపతులొక్కింత విశ్రాంతి నంద నెంచుచుండిరి. రాజేంద్రుఁడు చోళభూమి కేలిక యయ్యెను. ఆ వీరవరునిసోదరుఁడు వీరరాజేంద్రుఁడు సర్వసేనాధిపత్యమును వహించి నరపతికిఁ గుడిభుజమై యలరారుచుండెను. పూర్వచాళుక్య నాయకుఁడు విజయాదిత్యుఁడు వీరరాజేంద్రునిచే ప్రేమింపబడు వాఁడగుట నాతని యాధిపత్యమును గమనించి మైత్రియొనర్చు ప్రయత్నముల నొనరించుచుండె. వీరరాజేంద్రుఁ డధికారనామకతూర జలపానమున తృష్ణాతీతుఁడై చోళరాజ్యలక్ష్మినాక్రమింపనభిలషించుచుండెను. విక్రమసింహుని పరాక్రమము తన జ్యేష్ఠభ్రాత విషయమున గాంచినవాఁడగుట చేతను పూర్వచాళుక్య సేనాప్రాబల్యత నెఱింగినవాఁ డగుటవలనను విజాయాదిత్యుని సహాయ మభిలషించెను. ఇరువురకును రాయబారములు జరుగుచుండెను. చారిత్రకవిషయములిఁకఁ జాలును.

## సప్తమ ప్రకరణము.



పల్లవరాజ బంధుపుఁడు నరసింహవర్మ విక్రమసింహపురమును బాలించుచుండెను. విజయదశమి నాఁడతఁడు రాజకుమారుల ధైర్య, శౌర్యముల పరీక్షించి రాజ

నారాయణ బిరుదము నొసంగదలంచెను. ఆకాలమునందు బల్లవులతో నేరికిగాని వైరముండక పోవుటను గాంగులు, పాండ్యులు, చోళులు, బనవాసులు, కాదంబులు, పూర్వ పశ్చిమ చాళుక్యులు నాహ్వానింపఁబడిరి.

నరసింహావర్మ తనయుఁడు, మదాలస సోదరుఁడు మధుసూదనవర్మ మహాపరాక్రమశాలి. అతఁడస్త్రచాలనము నందేమి, హస్తిలాఘవమునందేమి, మల్లయుద్ధమునందేమి యాఱితేఱినవాఁడు. దానివలననే నరసింహావర్మ రాజనారాయణ బిరుదమును దప్పక తనయుఁ డందఁగలఁడని విశ్వసించి యుండెను. దక్షిణ భారతరాజకుమారులముందు నిజతనయు పరాక్రమాతిశయమును బ్రదర్శింపవలయునను స్వార్థపరతంత్రత యా భూజాని యందియుండక పోలేదు.

ఒక విశాల సమప్రదేశమున రంగ మేర్పరుపబడెను. అస్త్రవిద్యా ప్రదర్శనము, మల్లయుద్ధము, లక్ష్యభేదనము మొదలగు వాటియందు సమర్థుఁడగు పురుషుఁడు రాజనారాయణ బిరుదమున కర్హుఁడుగ భావింపబడెను. ఒక వర్తులమును గీచి మధ్య నావీరుఁడుండ వర్తులరేఖపై నిలచిన యేబదుగురు భటులు పదినిముసము లెడతెఱపిలేక విసరు ఫలముల ఖడ్గసహాయమున రెండుగా నఱుకవలయును. భారతకాలమునాటి మత్స్యయంత్రము బోలినది యొకటి కాసారమునందు బ్రతిఫలించు వృక్షమును గాంచుచు నద్దానిపై దిరుగుచుండు చక్రమును గ్రిందబడగొట్టవలయును

నూఱుగజముల దూరమునందు చక్రమొకటి త్రిప్పుచుండ నద్దానిచుట్టును గట్టబడిన వస్తువులలో నిర్దేశింపఁబడిన దానిని శరముతోఁ గొట్టవలయును. ఆటంకము లెక్కుడుగ నుండు నొక దశయోజన ప్రదేశమున కేఁగి రావలయునను కార్య క్రమ మాహ్వాన పత్రములందు లిఖించి యంపబడెను. పెక్కురు రాకొమరులును, భటాగ్రేసరులును దమకవి శక్యము కావని యెఱింగియు జూడనైన గల్గుదుమను నభి ప్రాయముతో నట కరుదెంచిరి.

ఆహవమల్లుని తనయులు సోమేశ్వర విక్రమాదిత్యులును, కంచీపాలకుని తనయుడు, కీర్తివర్మ, గాంగులరాజు కర్ణుడు, కాదంబ నృపసోదరుఁడు బిందుమాధవుఁడు, పాండ్య నృపతితనయులు హరిహర సాంబులు నరుదెంచి యుండిరి. రాజమహేంద్రవరమునకు నాహ్వాన మంపబడెను. విజయా దిత్యుడు సారంగధరుని పొమ్మనియెను గాని యతఁడు మహేంద్ర గిరియందలి గానవిద్యాప్రవీణ సమ్మేళనమున కాహ్వానము వచ్చియుండుట నట కేఁగక తప్పదని దశ రాత్రము లారంభింపక పూర్వమే బయలుదేరెను. విజయసింహాది వీరకుమారులు మాత్రము పయనమైరి.

మదాలస చోరనాయకునితో సంఘటన మైనప్పటి నుండి భర్తృదర్శనమే యొసర్పక జనకుని సందేశమంది వాసంతికతో సింహపురిఁ జేరనరిగెను. పోవుటకు ముందు వేయి విధముల సారంగధరుని రాగోరెను గాని యా రాచబిడ్డడు మహేంద్రగిరికి పోకతప్పదని దృఢముగ దెలిపెను.

నవరాత్రములు సింహపురియందు మహావైభవముగ జరిగినవి. ఆయుధపూజాదులు మిగుల నాడంబరముగ జరిపిరి. రాకుమారులు సమీప దుర్గమారణ్యముల కేఁగి వన్యమృగముల నణఁగించి నిజ పరాక్రమంబులఁ బ్రకటించుకొనిరి. విజయుఁ డసమాన వీరుఁడగుట కొందఱు గ్రహింపఁగలిగిరి. విజయదశమినాఁడా పురము దర్శనీయమై యుండినది. శూరకుమారులే శతసంఖ్యాకులై యుండిరి. ప్రేక్షకలోకము లెక్కింప వీలుకానిదై యుండెను. వీథులందు నడచుటయే కష్టముగ నుండినది. అరుణోదయ మగునప్పటికే నరసింహవర్మ యాత్మజునితో మంగళతూర్య నినాదములతో రంగస్థలమును జేరెను. నన్నపార్య విరచిత భారతము నందలి కుమారాస్త్ర విద్యా ప్రదర్శనమును దలపించెడు యా రంగస్థలము వీరకుమారులతో నిండియుండినది. ఉన్నతాశ్వములపై నెక్కి యా శూరులెంతయు జూడ నొప్పుచుండిరి. మొదట పది యోజనము లాలంకములుగల దూరముల నశ్వములపై బోయివచ్చుట జరుగ భూజాని యాజ్ఞాపించెను.

ఆరాజుగా రాజ్ఞాపించిన మాత్రమున విద్యుచ్ఛక్తిచే ద్రోసివేయఁబడిన వస్తుజాలమువలె బిరుదు నాకాంక్షించు వీరులు వారువముల నదల్చిరి. ఆ యాజానేయములు కంచెల నెగురుచు కాలువల నుత్తరించుచు పంక ప్రదేశముల దాటుచు పరుగిడు చుండినవి. ముందుబోయిన యతఁడు వెనుబడు చుండెను. వెనుక నరుదెంచిన వాఁడు ముందువ

కేఁగుచుండెను. కొందఱు వారువముల నుండి దొరలు చుండిరి. కొందఱు పడబోవుచు సుస్థిరులై యుపవిష్టులగు చుండిరి. దాదాపు శతసంఖ్యాకులగు నా యువకులలో నిరువదిగురు మాత్రము తిరిగి రాగలిగిరి. అందు విక్రమాదిత్యుఁడును మధుసూదనవర్మ విజయులు మాత్రము సమముగా రాగలిగిరి. తదితరులు వెనుఁబడిరి.

ఖడ్గ చాలనమునం దగ్రస్థానము బడయ వింశతి శూరులు ముందున కరుదెంచిరి. అందులోకూడను విక్రమ, మధుసూదన, విజయులే విజయులైరి. విక్రముఁడు పది ఫలములను, మధుసూదను డెనిమిదింటిని, విజయుఁడు పండ్రెండింటిని కొట్టజాలక పోయిరి. ఇతరులు పది పదునైదు ఫలముల మాత్రము కరవాలమున నఱుకఁగలిగిరి.

అటుపిదప నీరమునఁ జూచుచు వెనుభాగమునం దుండు వృషాగ్రచక్రమును బాణమునగొట్ట యత్నించిరి. అందుల కరుదెంచిన మేటి విలుకాండ్రలో నొకఁడైన సమర్థుఁడు గాకపోయెను. నరసింహవర్మ తన యత్నము నిష్ఫలంబగునని భయపడసాగెను. పిదప లక్ష్యభేదన మొనర్ప నా కూర్మనాథుఁడానతిచ్చెను. అందులో మధుసూదన విజయులుమాత్రము లక్ష్యమున కొక్క నాలుగంగుళముల దాపున గొట్టఁగలిగిరి.

సింహపురాధినేత యదంతయుఁజూచి కరవాలముతో నందు బదుగుర ముందునకు రా నాజ్ఞాపించి దంద్వయుద్ధ

మునకు డీకొనగోరెను. ఆ యుద్ధమునందు విజయుఁడగువాని కా బిరుద మొసంగఁ బడుననియు కరవాలముతో ప్రత్యర్థిని ముమ్మారు తగిలిన వాఁడు జయించినటుల నిరూపింపఁబడు ననియుఁ బ్రకటించెను. మంత్రి మల్లయుద్ధమును జ్ఞాపకపరుప కొంతవడి యోచించి వాలుయుద్ధమును ముగిసిన పిదప నది యగునటుల నిర్ణయించెను.

అయిదు తెగలుగ వాగు దంద్వయుద్ధము నారంభించిరి. గాంగుల నాయకునితో మొదటినుండియు వచ్చిన మూఁగురు మాత్రము నిలచిరి. అయిదవజత చాలించుకొనెను. మధుసూదనవిక్రములును, కర్ణవిజయులును విశ్రాంతి గొనిన పిదప పోరునట్లు రాజాజ్ఞాపించెను. ఆవిశ్రాంతి సమయమునందు తదితరులు మల్లయుద్ధమొనర్ప బాగుండునని మంత్రిగారు వలుక నరసింహవర్మ సమ్మతిఁజూపెను. అది యొక రెండు ఘడియలకాలము జరిగెను. అందు బిందుమాధవుఁ డగ్రస్థాన మందెను.

పిరోత్తములగు నలుగురకు ద్వంద్వయుద్ధ మారంభమయ్యెను. వారి విద్యాకౌశలమున కటనుండువారు ముగ్ధులై పోయిరి. నరసింహవర్మ తాటాకుగట్టఁబడిన యొకశరముతన పాదములకడ బడుటయు దనయుని విద్యాకౌశల దర్శనమగ్నుఁడై తెలియకుండెను. మధుసూదన విజయులు జయమందిరి. అంత నారాజాగ్రణి యచ్చెరువుమెయి శరమును బరికించి మంత్రి నది పరిశీలింపఁ గోరెను. ఆ శరము నా సచివుఁడు పెఱకుటే శ్రమ యనుకొనెను.

అందీ క్రిందివిధముగ వ్రాయఁబడి యుండెను.

రాజకులావతంసమా!

మీరు పరాక్రమ పరీక్షనొనరించి బిరుదము నొసంగ నెంచుటవిని నేనందిన యానంద మింతింతనరాదు. అనాహూతుఁడ నైనను క్షత్రియకుమారుఁడ నగుట నిజశౌర్య ప్రదర్శనోత్సుకుఁడనై యుంటిని. ఉదారబుద్ధిగల మీరన్యధా భావింపరను నాశమెయి వేచియుంటిని. ముదలమైన చనదెంతును. ఒక్కమనవి. నేఁప్రచ్ఛన్నుఁడను. కారణాంతరములచే నాయుంగమచ్చములఁగాని, నామమునుగాని వ్యక్త పఱుప నిచ్ఛగింపను. మీసమ్మతి నెదురుసూచు

భుజబలప్రధానుఁడు.

'వనకేసరి'

అది వినినంత నట మూఁగిన జనులు విభ్రాంతులై పోయిరి. ఆ ప్రచ్ఛన్నవ్యక్తినిజూడ నరసింహవర్మ యభిలషించుచుండెను. సచివశిఖామణి నావృత్తాంతము నట సమావేశమైనవారికిఁ దెలుపఁ జెప్పెను. బిరుదు నభిలషించి యరుదెంచిన రాకొమరులలో గుసగుసలు బయలుదేఱెను. ప్రచ్ఛన్నవ్యక్తి యెట్టివాఁడైనదియు నెఱుంగ నుత్సుకత ప్రబలమైయుంట నెల్లరు సమ్మతించిరి. అంతనొక రాజదూత గంభీరముగ వనకేసరి రాకకు మహారాజు సమ్మతించెనని పలికెను.

అయిదారు నిముసముల కాలములో నున్న తాశ్వము నధిరోహించి మన వనకేసరి యట ప్రవేశించి వినయాతిశయ ప్రకటితాభివందన మొనరించి తన యాశ్వికతా ప్రదర్శనమునకంటె లక్ష్యభేదమును వృషభాగ్ర చక్రమును గొట్టుటకు ననుజ్ఞ నభిలషించెను. సింహపురపాలుఁడు సమ్మతింప, నతఁడు సరోవరోదకమునఁ జూచుచు నవలీలగ చక్రమును బడగొట్టెను. కరతాళధ్వని మిన్నుముట్టెను. అంతట లక్ష్యభేదనము నొనర్చనిలచెను. సర్వము సిద్ధమైనపిదప నొకములుకును గొట్టెను. అది తప్పి పోయెను. అంతనొకింత సుస్థిరుఁడై నిర్దేశవస్తువును క్రింద పడవైచెను.

అటుపైనాతఁడు వర్తులాకృతి మధ్యమున నిలిచెను. అదిగాంచి బిరుదమునకై యరుదెంచిన రాకొమరులు ఫలముల విసర నారంభించిరి. వనకేసరి కరవాలమును ద్రిప్పుచు పది నిముసములు విసరఁబడిన వాని నన్నిఁటిని శకలములొనర్చెను. మధుసూదనునిచే నోడింపఁ బడిన విక్రముఁడు మహానందము నట్టహాస పూర్వకముగ నగుపఱచెను. అందులకు సింహపురీశసుతుఁడు రోషావిష్టుఁడై తనపై వనకేసరిని ద్వంద్వ యుద్ధమునకురా నాహ్వానించెను. వనకేసరి దరహాస మొనరించి గెలచిన విజయుని తోడుగాఁ గొని రాఁగోరెను. అందులకు మధుసూదనుఁడు సమ్మతింపఁడయ్యెను.

వనకేసరి యుద్ధమునకుఁ గడంగెను. అత్యద్భుతముగ నా యిరువురు పోరాడుచుండిరి. కర్ణార్జునుల మఱపించు

చుండిరని యటనున్న ప్రేక్షకులు తలంచుచుండిరి. వాసంతిక మదాలసతో నరుదెంచి యంతిపురకాంతలతో నేకాంత ప్రదేశమునందుండి యీ వనకేసరి సంపూర్ణముగ దృక్కులతో మ్రింగివేయునట్లు చూచుచుండినది మదాలస యొక్కింత యీర్ష్య నందుపై నందకపోలేను. ప్రేక్షకులు నిలుచుటతో కూర్చుండుటతో ప్రక్కవానిపై వాలుటతో మెఱుంగకుండిరనినచోఁ జాలును.

వనకేసరి నాలుగు నిముసములలో క్రోధారుణిత నయనుఁడగు మధుసూదనవర్మను కరవాలముతో స్పృశించి తొలఁగి నిలచెను. అంత గంభీరభాషణముల విజయవిక్రముల తనపై రాగోర వారటులొనర్చిరి. వారలతో పదినిముసములు పోరాడి విజయుని వాలునెగురగొట్టియు విక్రముని కైదువు విరుగఁగొట్టియు దరహాస మొనరించెను.

అంత వనకేసరి కలవాలమును విజయునకొసఁగి ముఖ వస్త్రమును గట్టిపఱచుకొని దట్టికట్టుకొని మల్లయుద్ధమునకు బిందుమాధవు నాహ్వానించెను. భ్రాంతిచేతనుక్కుఁడగు నాతఁడు పెక్కు నిముసములకుఁ గాని తేఱుకొనఁజాలఁడయ్యెను. వారి మల్లబంధ విశేషములు మఱియొక మాఱు ప్రేక్షకుల తన్మయుల నొనరించెను. మదాలస సోదరుని బిలిచి తమకు వనకేసరి యొనరించిన సహాయమును జెప్పి యతఁడు చోర నాయకుని కడ నందియొసంగిన కమ్మను జూపెను. మధుసూదన వర్మ వనకేసరిపై గల కార్పణ్యము నంతయు మఱచిపోయెను.

అంతలో విననగు కరతాళధ్వనులకుఁ దిరిగి చూచెను. స్థూలకాయుఁడగు బిందుమాధవుని వనకేసరి పైకెత్తిపట్టి యుండెను. క్రిందవేయువానివలె నటించి తటాలున సైకత ప్రదేశమున పరుండబెట్టి కరదానమున నిలిపెను.

అంతలో మధుసూదనవర్మ యట కరుదెంచి "వీరాగ్రణీ! నీ వలన మన యాంధ్రావళి ధన్యయయ్యెను. ఈ వీరకుమారుల పక్షమునను భవదీయసాయ మందిన మత్సోదరి పక్షమునను నభివాదము లర్పించుచుంటిని. నీకంటె రాజనారాయణ బిరుదము నంద సమర్థులు లేరు. నీ పరిచయభాగ్యము మాకు త్వరలో గలుగును గాక!" అనెను.

"రాకుమారా! నన్నేల గొప్ప చేసెదు. అస్త్రాది విద్యాతిశయమున గర్వ మొందుట దుర్జనలక్షణము. ఇప్పటికి సెలవు గైకొందును. మఱొకప్పుడు మీకడ కరుదెంచి మీ పరిచయభాగ్యము నందువాఁడ. అభిజ్ఞానార్థ మేదైన నొసంగిన మీరిఁడ కరుదెంచునపు డది గైకొని యరుదెంతును" అని వనకేసరి గంభీరముగ బల్కెను.

ఇట్లు మాటాడుచు నావీరద్వయము విజయవిక్రములతో నరసింహవర్మను డాసెను. అంత మధుసూదనుఁడు "అవసరము లేదు. ఆ నీ చిబుకముపైనుండు మచ్చయే నిను గుర్తింపఁజేయగలదు పొమ్ము" అనెను. "ఏమీ! చిబుకముపై మచ్చయా! అతఁడెవరో నాకు దెలియు" నను కోమల కంఠము వినిపించెను. మదాలసావాసంతికలు తప్ప యితరులు

దాని గమనింపరైరి. వనకేసరి ఖడ్గాంబరాదుల బహుమాన మంది వీరు లందఱకడ సెలవుగైకొని యాజానేయము పై నెక్కి పోయెను.

నరసింహావర్మ యానాఁటి కార్యక్రమమున పాల్గొనిన రాకొమరుల, వీరుల నర్హరీతి మణిభూషణాంబర వాహనాది కముల సత్కరించి కొన్ని దినములుంచుకొని యంపివేసెను.

---

## అ ష్ట మ ప్ర క ర ణ ము .

పశ్చిమ చాళుక్య యువరాజు సోమేశ్వరుఁడు వీరుఁడు గాఁడు. విషయలోలుఁడగు నాతఁడిరువది యెనిమిది సత్సర ములవాఁడు. రూపవంతులలోఁ జేర్పఁదగినవాఁడే. అధికార బలము నాకాంక్షించు నతఁడు చేయని యవమాన కార్యము లేదు.

పై ప్రకరణమునందొక కోమలకంఠమున చిబుకముపై మచ్చగల యాతఁ డెవ్వరైనదియుఁ దనకుఁ దెలియునని చెప్పినటుల వ్రాయబడెను. అయ్యది మదాలసా వాసంతికలు గాక సోమేశ్వరుఁడు నాలకించి యుండెను. వీరుఁడుగాక పోయినను నేలకొలది జనులమధ్య ధన్యవాదముల నందిన వీరునిపై నసూయనితడు గాంచియుండెను. ఏదోయొక బలవత్తర కారణములేని దాతఁడు ప్రచ్ఛన్నుఁడుగ నుండఁడనియు, నాతని ప్రచ్ఛన్నత విచ్ఛిన్నమొనర్చి వానికి సంకటము గలిగింప వలయుననియు నతఁడు నిర్ధరించుకొనెను.

ఆ క్రియాచరణమున నాతఁడు వేఱొక యభిప్రాయమును గలవాఁడై కూడ నుండెను. ఆ కోమలకంఠము గల కాంత వదనారవిందము నొక్క క్షణకాల మతఁడు గాంచి యుండెను. రసికాగ్రగణ్యుఁడగు నా రాకొమరుఁ డద్దాని హృత్ఫలకమున జిత్రించుకొనెను. తదనంతర మనుక్షణము నామూర్తి ఘనీభూతమై వాని ప్రతి రక్తబిందువు నందును ప్రతిబింబితను బొందెను. ఆవనితను బిగియార కౌఁగిలింపనిది తన జీవనము వ్యర్థమని యాతనికిఁ దోఁచెను. దుర్జనుల వాంఛలకు మేరయున్నదా? అనుచిత మనున దున్నదా? చదువరు లెఱుంగరా?

ఈవిషయములందు కుశాగ్రబుద్ధియగు నాయువకుఁడు పునర్దర్శన మొనరించుకొన నుపాయమును బన్నెను. మఱునాఁడలవాటు గాకున్నను సూర్యోదయము గాకమున్న మేల్కాంచి, సింహపుర రాజోద్యానమునం దొక నికుంజమున డాగెను. నాలుగైదు గడియలకాల మతఁడు కదలక మెదలక కూర్చుండి యుండెను. ఆహా! కాముకతకును వైరాగ్యమునకు నిస్త్రీయందు భేదములేదుకదా? మన శ్రీలము మాన్ప నిది సమర్థమనియు కాఁబోలు 'కామిగాక మోక్షకామిగాఁడు' అని మనవారు తెల్పియుండిరి. ఎటులైననేమి యటకొక యువతీమండలి యరుదెంచెను. అందా కాముకుఁడు నిముసమాత్రసందర్శన మొసంగిన మోహనాంగిని గాంచెను.

ఆబిడ యందు నూతన విలాసము లాతని కెన్నెని గోచరములయ్యెను. ఆయన్నులమిన్నను బొందవలయునను వాంఛ బలవత్తరము కాగా పరభృత తిరస్కృతములగు వారి భాషణముల సావధానముగ నాలకించెను. వా రా దినము సంజవేళ లరుదెంతురని విని యటనుండి రహస్యముగ వెడలి పోయెను.

ఆనాఁడాతఁ డాహారమునైన సరిగ గొనఁడయ్యెను. హంతకుల గొందఱి ధన దానమున వశ్యుల గావించుకొనియెను. ఉద్యానవాటిక యందలి నికుంజములయందు వారల భద్రపఱచెను. సూర్యుఁడాదిన మెందుల కాలస్యముగ గమనము సాగించెడునని పలుమారు భావించెను. ఏదో మాటాడ నరుదెంచిన విక్రమాదిత్యుని గసరి పంపివేసెను. ఎట్టకేలకు సాయంసమయమయ్యెను.

భానుఁడు చరమగిరిని జేరకమున్న యిరువురు జవ్వను లటఁబ్రవేశించిరి. వారు వనవిహారము నట్టె నలువక యొక గోస్తనీకాయమానముక్రింది చలువరాతిన్నెపై నుపవిష్టలైరి. ఒకకాంత మఱియొకర్తను ప్రచ్ఛన్నవ్యక్తియెవరని ప్రశ్నించుచుండెను. ఆ బాలిక తెలుప వీలుకాదనియు, తనకు తెలియదనియు పదింపదిగ తెలుపుచుండెను. వారిరువురు మృదు గభీరముగ మాటాడుకొను లోపల హంతకులు నూతన నాయకు నాదేశంబుమెయి, వారల డాసి కర్కశంబులగు కరములతోఁ బట్టుకొనిరి. ఒకర్త యందు బిగ్గఱగ నఱచెను.

రెండవయూపె మాటాడుటకైన శక్తిలేనిదై యుండెను. వారికేల భీరువ లను నామము బ్రహ్మ సార్థకపఱచెను ?

ఒక్కింత తడవులో వారు బంధింపబడిరి. ఇంకను వెలుగుండుటను సోమేశ్వరుఁడు వారా యువతులను పురికి పశ్చిమదిశనైదు క్రోశముల పరిమితినుండు భవనమున నుంపవలయు ననియు, నొకరిద్దరటనుండిన బహుమానధనమును దెత్తుననియు బలికి యుత్సాహాతిశయమున తన విడిది చేరెను. అతనికంటె ముందే యెటులో యాకాంతాపహరణవార్త బయలు పాఱికి యుండెను. విజయ విక్రములను, బిందుమాధవ మధుసూదన కీర్తివర్మలును వాలులధరించియశ్వముల నారోహించుచుండిరి. కీర్తివర్మ యపహరింపఁబడినది తన సోదరి వాసంతికయనివిని ఖిన్నుఁడై యుండెను. ఆతని నెల్లరునోదార్ప యత్నించుచుండిరి. సోమేశ్వరుఁ డావార్తవినినపుడు జూపిన నటనా కౌశల్యము ప్రశంసాపాత్రమై యుండినది. వారలమించిన యుత్సుకత గలవానివలె యుత్సాహాఢ్యుఁడై బయలుదేఱెను. కపటోపాయ నిధియగు నాతని భావవీధి నప్పుడే నూతన తంత్ర మొకటి యుత్పన్నమయ్యెను. వారలతో కొంత దవ్వరిగి వెనుజిక్కి వారల పశ్చిమభాగ భవనమువైపు పోఁగోరి యదృశ్యుఁడయ్యె. అన్వేషణ కార్యనిమగ్నులగు వారు వాని గమనింపరైరి.

ఆ వీరబృందము సమీపపుఁ గ్రామమ్మువితోఁపుల నెమకుచు నాభవనమును జేరునప్పటి కంధకారము వ్యాపిం

చుటయు దాని శశాంకుఁడు పోదోలుటయు జరిగెను. ఆ శరత్కాల జ్యోత్స్నయందు వారుల్లాసముగ నుండుట మాని తమయత్నము నిరర్థకమగునేమోయని విచారించు చుండిరి. వారు తననుజూచి యానందింపకుండుటకు కలశోదధి తనయుఁడు దరహాస మొనర్చినటులుండెను.

ఆ భవనము మూర్ఖహృదయమువలె నంధకార బంధురమై యుండినది. అందు వేసవులందుండిన వాఁడగుట మధుసూదనవర్మ దాని ద్వారములన్నిట నొక్కమాఱు లోనఁ బ్రవేశించుట బాగుండునని దానిచుట్టునేఁగ వారికి దెలిపెను. మాఱుమాటాడక యెల్లరు నటులొనరించిరి. వారు వారువములనుండి దిగి కరవాలముల దృఢముగ బట్టుకొని చిన్నగ సౌధమును డాసిరి. వారు భవనములో నడుగుపెట్టినంత చెరియిరువురు దృఢకాయులు వెనుబాలున వారిపైఁబడి త్వరలో నందఱ బంధించిరి. కొలఁదిగ వెలుగు గల యొక విశాలపుగదియందు వారు నిలుపఁబడిరి.

కొంతవడి కటకు ప్రచ్ఛన్నవ్యక్తి యరుదెంచెను. ప్రయత్నమున మార్చుకొనిన గొంతుకతో "రాకుమారు లారా! స్వాగతము. మిమ్ముబంధింపవలసినందులకుఁ క్షమింపఁ గోరుచుంటిని. నే నపహరింపఁ జేసినవారు కన్యలగుట మీరెట్టి విచారము నందనవసరములేదు. వారు నాయధీనము నందుండిరని తెలుపనొకని బంపితిని గాని మీరింతలో నరు దెంచితిరి. ఈనిశాశేషమిటులే గడుపవలయును. ఆకన్నియల

నే గొనిపోవువాఁడను" అని పలికెను. గతదిన మా ప్రచ్ఛన్న వ్యక్తి పౌరుషమును గన్నులార గాంచిన వారగుట నొక రొకొక్కక్క విధముగ విచారించుచు నిలచియుండిరి. మధు సూదనవర్మ యేదియో యన నోరు తెఱచునంతలో నొక వికటాట్టహాసము వినిపించెను. ఆ ప్రచ్ఛన్నుఁడును చకితుఁడు గాక యుండలేకపోయెను. "పిఱికిపందలు మహాశూరులగుట కూడనా? వ్యాఘ్రచర్మధారియగు గార్దభమును రాకుమా రులారా! గుర్తింపజాలకపోయితిరా?" అను వారిద గంభీర నినద మొండు వినిపించెను. ఆ సవ్వడి యాగిన మఱుక్షణ మందే మఱియొక ప్రచ్ఛన్నవ్యక్తి యట ప్రవేశించెను.

మొదటియతఁడట నిలచియున్న ఘాతుకుల, రుద్ధ మగు కంఠముతో నతనిపై బడ నానతిచ్చెను. "ఓరీ! వనితల బంధించిన వీరులపై నాకరవాలము తెగదు" అనుచు పురో గాములగు నొకరిద్దఱ కరవాలముల నెగురగొట్టి శిన వాలు పలుచనిభాగముతోఁ బశువుల గొట్టినటులగొట్టెను. అదిగని యితరులు పిక్కబలము చూపిరి. రెండవయాతఁడెవరో యన నేల? మన వనకేసరి. మొదటి ప్రచ్ఛన్న వ్యక్తికడకు దుమికి వడకెడు నతనిబట్టుకొని "మహాశయులారా! నారూప మున నిట్టి హీన కార్యమునకు బూని యొక క్షణకాలము మీ హృదయముల నస్మద్విషయమున గలుషితముల నొనర్చి నందులకు వీని నెటు శిక్షించినను పాపములేదు. ఈవిధముగ కంపితుఁడగు నీచునేమి సేయుటకు దోఁచకున్నది. మీరే

విచారింతురు గాక ?" అనుచు వాని వదనముపైని వస్త్రమును లాగివైచి క్రింద పడద్రోసెను.

సోమేశ్వరుని జూచినంత నావీరులందినయాశ్చర్యమునకు మితిలేదు. విజయుని బంధముల వదలించి వనకేసరి యచటుచూసెను. ఆ వీరులందఱును విడినడి గర్వోన్నతములతో నా పశ్చిమ చాళుక్యయువరాజును జూచునంతలో నాయువతీద్వయముతో వనకేసరి యటఁ బ్రవేశించెను. అంత నతఁడవనతవదనుఁడై యుండు సోమేశ్వరుని వారిరువురికడకు లాగి వారల క్షమాపణము గోర నాజ్ఞాపించెను. మాటాడక నా కాముకుఁడు క్షమాభిక్ష వాసంతికా మంజులల నభ్యర్థించెను. ఆ లజ్జావతులతని బుద్ధిగలిగియుండఁ దెన్పిరి.

సోదరిఁజూచినంత నాహ్లాదమందిన కీర్తివర్మయామెను డాసి యాలింగన మొనర్చుకొనెను. వాసంతిక "సోదరా! ఈవీరాగ్రణి నన్నవమానమునుండి రక్షించుటకిది మూఁడవ పర్యాయము. ఈ మహోపకారి నెటుల సత్కరింతువో నీక తెలియును" అనెను. కీర్తివర్మ యేదో పలుకఁబోవ, వనకేసరి ముందున కరుదెంచి మధుసూదనవర్మతో "వీరాగ్రణీ! మీ యానతిగొనక మీ యీభవనమునందు వసించినందులకు క్షమింప వలయును. మీ జనకులతో నా యపరాధము మన్నింపఁగోరుఁడు. వీరులారా! ప్రాతఃకాలమున పయనమై పోవుచుంటిని. క్షత్రియకుల కళంకుఁడగు నీతఁడు మరల మీ దర్శనము గలిగించి నందుల కతనికిఁ గృతజ్ఞుఁడను.

మంజులా! నీజన్మవృత్తాంతము గోప్యమైనది. దాని భేదింప యత్నము నొనర్చుచుంటిని. ఆ పల్లవరాజతనయను వదల కుండుము. వాసంతికాదేవీ! యీ బాలికను జాగ్రత్తమెయి సోదరివలె జూచుచుండుము" అని ప్రణయ మధురములును మోహనదీపములును నగు నాయువతుల క్రీగంటిచూపులఁ బాటింపక యచటు బాసెను. మదిరేక్షణల వాల్గంటిచూపుల లెక్కింపని యీ వీరుఁడే వీరుఁడు; పురుషాగ్రణియని మా చదువరులు గ్రహింపరా!

## నవమ ప్రకరణము.



ఉరయ్యూరు రాజధానిగ చోళులు విశాలరాజ్యమున కధికారులై యుండిరి. పై యంశములు జరిగినప్పుడు రాజేంద్ర చోళుఁడు ప్రజాపాలనము నొనరించుచుండెను. కొప్పముకడ వీరస్వర్గము నందనేఁగిన సోదరునికై వ్యాకులమాతని నింకను వదలి యుండలేదు. రాజాధిరాజతనయ మధురాంతకదేవి యగుపడినపు డంతయు నతఁడు రణరంగమునకు తానేఁగి యుండినయీపె పితృహీన కాకుండెడిదిగదాయని పరితపించు చుండెను. ఆయువతిలలామ మెట్టి యల్పవాంఛ కలిగియుండి నను స్వయముగ దాని నెఱవేర్చుచుండెను. తన తనయుఁడగు రాజరాజు చూపు సోదరీప్రేమమున కానందము నందు చుండెను. ఏకోదరులువోలె నుండు వారి యనురాగము నధికము నొనర్ప శక్తివంచన లేక యత్నించుచుండెను.

వీరరాజేంద్రుఁడు సమయమువచ్చినపు డంతయు పూర్వచాళుక్య నాయకుఁ డగు విజయాదిత్యుని గుఱించి ప్రశంసించుచు వారి సాయమున పశ్చిమ చాళుక్యనాయకుని మట్టుబెట్టనగు నని బోధించుచుండెను. తన సోదరు మృతికిఁ గారకులు పూర్వచాళుక్యులేయని నమ్మినయాతనిమానసము కనిష్ఠసోదరుని యాలోచనమునకు సమ్మతింప కుండెను. వీరరాజేంద్రుఁడు మాత్రము పశ్చిమచాళుక్యుల నొకమా రోడించిన తుంగభద్రానది వఱకును తమ రాజ్యమును వ్యాపింపఁజేయవచ్చుననియు పల్లవులను సామంతులనుగ జేసి కొను నుపాయము తెలిసియుండుటను విషయలోలుఁడగు విజయాదిత్యుని లోబఱచుకొనుట కష్టముకానిపని యగుట దక్షిణ భారత భూమిని సంపూర్ణముగ స్వాధీనపరచుకొ వచ్చుననియుఁ దలపోయుచుండెను. ఎటులేని చక్రవర్తిత్వము సంపాదింప నతఁడు స్థిరసంకల్పుఁడై యుండెను.

వీరరాజేంద్రునకు మధురాంతకదేవి కంటెను జిన్న దగు త్రిపురసుందరియను కూఁతురును, బాలరాజను తనయుఁడు నుండిరి. త్రిపురసుందరిని మధుసూదనవర్మ కొసంగిన వారు సంబంధమున నూరకుందురని యతఁడు తలంచెను. పూర్వ పశ్చిమచాళుక్యుల విషయమున సోదరుఁ డెట్టి నిర్ధారణము నందనివాఁడగుట సింహపురియందు జరిగిన కార్యకలాపమున పాల్గొన కుండెను. అదియుగాక రాజరాజుగాని బాలరాజు గాని షోడశవర్షప్రాయులైనను గాకపోవుటను సింహపురి కరుగకుండిరి.

మధురాంతక రాజరాజుల యన్యోన్యత నతఁడు దేప గించుకొనక పోలేదు. తాఁజక్రవర్తి గానలయుననియు తన తనయుఁడు పిదప నా గద్దియ నధిరోహింప వలయుననియుఁ దలంచిన వీరరాజేంద్రునకు వారిపై నకారణద్వేషము జనించెను. బాలరాజును సర్వవిధముల సుగుణియగు రాజరాజు సహవాసము నిష్టపడకుండెను. వారిరువురు అస్త్రవిద్య నభ్యసించునపుడు నాబాలుఁడు జ్యేష్ఠపితృ తనయునిపై మచ్చరముగలిగి పౌరుషమున మించిపోన నిష్ఫలప్రయత్నములనొనరించుచుండెను.

క్రీ. శ. 1053 వ సంవత్సరము ముగియవచ్చెను. కొప్పముకడ రణము జరిగియు నత్సరము కావచ్చెను. రాజేంద్రుఁడు రాజ్యవిషయముల నఱమనస్సుతోఁ జూచుచుండెను. క్రమక్రమముగ వీరాగ్రణియగు వీరరాజేంద్రుఁడు సైన్యము నంతయుఁ దన చెప్పుచేతలకు లోఁబడునటు లొనర్చుకొనియెను. సూక్ష్మబుద్ధియగు నా రాజేంద్రుఁడు సోదరు నత్యాశ నెఱుంగఁగలిగెను. తా నుపేక్షించినను మధురాంతక రాజరాజుల కెట్టియిక్కట్టు రాఁగలదోయని వగచి సోదరుని మనోభిప్రాయానుసార మేఁగువాఁడై యతని రప్పించి విజయాదిత్యునితో సఖ్యమొనర్ప తనకుఁగల సమ్మతి నెఱిఁగించెను. ఆ తక్షణమే వీరరాజేంద్రుఁడు సమర్థుఁడగు నొక రాయబారిని రాజమహేంద్రవరమున కంపెను.

అంతకు ముందుగనే తనసోదరుని మఱెంత నిరుత్సాహునిగసల్పిన నతఁడు వానప్రస్థమున కేఁగుననియు; నట్టి

యెడ రాజ్య మనాయాసముగ తనకుఁ గైవసమగుననియు నాతఁడు యోచించియుండెను. రాయబారి నంపిన యొకటి రెండు దినములలో కన్యాకుమారి యగ్రప్రాంతమందలి చేర దేశమందలి రాజద్రోహులు కొందఱు దోపిడు లారంభించి రనియు వారినిబట్టి విచారణలేకయే నఱుకివేయుటకు నాజ్ఞ దయసేయవలయు ననియుఁ బ్రార్థించెను. రాజేంద్రుఁడు నిష్కల్మష హృదయుఁడగుట సోదరుఁడు కపటియని యెఱుంగఁ జాలకుండెను. కోరినవిధముగ నాజ్ఞనొసంగెను.

మఱి పదిదినములు గడచిపోయెను. ఒక రిద్దఱు భీకరాకారు లుఱిదీయఁబడిరి. తదుపరి వీరరాజేంద్రుఁడు సోదరుని కడనొక లేఖనుగొని వచ్చెను.

అందు

“ చోళరాజా !

నీతో విరోధ మభిలషింపని మా సంఘమునందు ముగ్గు రుఱిదీయఁబడిరి. ఇది కేవల మన్యాయము. త్వరలో నిందులకు ఫలము ననుభవింప గలవు ” అని వ్రాయఁబడి యుండెను. వీరరాజేంద్రుఁడు దానికై చింతించు సోదరు నెదుట వికటాట్టహాస మొనర్చి భయపడు టనవసరమనియు త్వరలో నారాజవిద్రోహుల తాను జమునిల్లుసొర జేయుదు ననియుఁ దెల్పెను. ఎంత సోదరుఁడు ధైర్య మొసంగినను రాజేంద్రుని హృదంతరాళమున వర్ణింపరాని సంకట మొదవు చుండినది. మఱినలుగు రుఱిదీయబడిరని విని యొక్కింత

ప్రశాంతచిత్తుఁడయ్యెనుగా నిమజీయొక వారము గడచులోపల మధురాంతక రాజరాజు లపహరింపఁబడిరి. రెండవ దినము హంతకులనుండియొక లేఖ వారిపై నాస వదలుకొమ్మనివచ్చెను.

ఆలేఖను జూచినంత నాసోదరద్వయ మందిన ఖేదము వర్ణనాతీతము. వారు హంతకులను ముక్కలు ముక్కలుగ జేయనెంచిరిగాని వారగుపడలేదు. వీరరాజేంద్రుఁడు సైనికుల నెల్లచోటుల నెమక నాజ్ఞాపించెను. జాడ తెలిపిన వారికి సహస్ర సువర్ణ నాణెముల బహుమతి నీయనుంటను దెలిపెను. ఉదయయ్యారునందలి పదునైదు వేల జనులును కంట దడిబెట్టిరనినచో మధురాంతక రాజరాజుల జనానురంజకత తెలిపినటులగును.

నాఁటినుండియు తన ప్రభుత్వకాల మంతయు క్రీ. శ. 1062 వఱకును రాజేంద్ర చోళుఁడు రాచకార్యములందు పరాఙ్ముఖుఁడై యుండెను. సర్వవిధముల సమర్థుడగు వీరరాజే రాచకార్యముల చక్కజూచుకొనుచు సైనికబలమును వృద్ధిపఱచుచు పశ్చిమ చాళుక్యుల నాయకుని ఆహవమల్లుని మదమడంప నెడతెగని యత్నములతో స్థిరసంకల్పుఁడై యుండెను.

---

## దశమ ప్రకరణము.

అది మంత్రాలోచన మందిరము. అందు నార్గురు పురుషు లుపవిష్టులై యుండిరి. వారు కార్యాలోచనము

సేయుచుండిరని చెప్పుటెందులకు? వారి భాషణముల వినిన జాలదా!

"రాజేంద్రా! ఉన్నటులుండి యిటు లోనరించితిమేని పౌరు లనుమానింతురు. ఎవరితోఁ బోరి మన సేనానులలో నగ్రగణ్యుఁడు మరణించెనో వారితో సఖ్యము నాకు సరిపడదు."

"సేనానీ! ఇంకను విక్రమునిపై నభిమానము వదల వైతివి. దురదృష్టవశమున నాతఁడు బ్రతికియే యుండినను నీకు సేనాధిపత్య మీయ మనరాజుగారు తలంచియుండిరి. అది యటులుండ కొప్పముకడ సమరము జరిగి వత్సరము మించిపోయినది. రాజ్యతంత్ర చాపల్య మెఱిఁగినవారు మన యాచరణమునకుఁ గారణమును విచారింపరు. ఇతరుల విచారమూ మనకు గ్రాహ్యము కాదు."

"అవును అంతియే"

"వ్రతము చెడినను సుఖమైనను దక్కవలయును. మన యీ కార్యాచరణము వలని ఫలము?"

"వీర రాజేంద్రుని వీరత్వము మనకుఁ దెలియనిదిగాదు. ఆతఁడు దక్షిణ భారత దేశముపై నేకచ్ఛత్రాధిపత్యము వహింపఁదలఁచి యున్నాఁడు. ఇతర రాజ్యమున రాజకీయ తంత్రముల సూక్ష్మబుద్ధిని పరికించితిమేని యాతని మనోరథ మీడేరుననుటకు సందియ మిసుమంతైనను లేదు."

"అతఁ డేకచ్ఛత్రాధిపతియగుటకు మన సహాయ మెందులకు ?"

"రామసింహా! ఆతురతను మానుము. ఆతఁడు చక్రవర్తియగుట మనకు లాభదాయకమనుటకు నిమిత్తము లేకపోలేదు. పల్లవులతో సంబంధముగల మనము, మనపొలిమేరనానుకొనియుండు సింహపుర ప్రాంతముల స్వాధీనపఱచుకొనుట కష్టముగ నున్నది. కారణాంతరములచే మనఱేఁడు సింహపురాధినేత తనయపై కుపితుఁడై యున్నాఁడు. నీబోఁటి పరాక్రమవంతుల సాయముండిన వీరరాజేంద్రుఁ డాహవమల్లుని లోఁబఱచుకొనఁగలఁడు. లోఁబఱచుకొనుటేమి పరాజితు నొనర్పఁగలఁడు. అందుపై నాతనిధాటి కడఁగియుండు కాదంబులు గాంగులు చోళులకు లోఁబడుదురు. అంత మన సహాయముగలవాడగుట ననవసరకలహము బెట్టుకొని పల్లవుల నెదుర్చును. దక్షిణోత్తరములందు శత్రువులుంట నరసింహవర్మ చోళులకు పాదాక్రాంతుఁ డగును. అట్టిచో తనకు దక్షిణ భుజమై వర్తించిన మనల కాతఁడు మఱువక కొంత దేశము నీయ నిష్టపడును అట్టితఱి మనము పల్లవ రాజ్యములోఁ గొంత భాగమును, పశ్చిమ చాళుక్యరాజ్యమునం దొకింతయు నభ్యర్థింతము. నినుబోఁటి వీరాగ్రణుల యునికి నెఱింగినవాఁడగుట తప్పక మన వాంఛితముదీర్చును. అట్టిచో విచారింపుము? ఆతని సామంతులలో బలవంతులమగు మన మాడించినటు లాడక తీరదు. మన పూర్వులు రాష్ట్రకూటుల నడంచి ప్రతిభగాంచిన విధమూహించితివేని చోళ

భూపాలుఁ డాసించు చక్రవర్తిత్వము మనకు రావచ్చును. సేనానాయకత్వము పోయి సామంతత్వము నందవచ్చును."

"మంత్రివరా! ఇక చాలును. మీ మాటలచే మునీంద్రుఁడైన రాజ్యకార్య ప్రవేశము గలవానిగ నొనర్ప గలరు. ఇవన్నియు రిత్తకోరికలు కావచ్చును. ఈ యాకాశ హార్మ్యము క్రిందపడవచ్చును."

"ఇవియాకాశహార్మ్యములుగావనుటకీలేఖ పఠింపుము. మహారాజుగారుమఱియొకమాఱు వినగోరి యుండిరి." ఆలేఖ నందుకొని రామసింహుఁడిటు చదువ నారంభించెను.

"మహారాజ విజయాదిత్యునకు చోళనాయకుననుమతిని వీరరాజేంద్రుఁడు వ్రాయులేఖ—

మీ వంశమునకును మావంశమునకును చిరకాలము నుండి వచ్చెడు బాంధవ్యమును బాటింపక యనవసర మన స్తాపములతో మీరుమావిరోధియగునాహవమల్లునిపక్షమునఁ బోరాడితిరి. అందులకాక్షేపించుటలేదు. గతజలసేతు బంధనముమాని యిపుడు మేము మీ మైత్రి నభిలషించుచుంటిమి. అయ్యది మీకు వెఱచిమాత్రము గాదు. మీ వీరత్వమును బ్రశంసించువాఁడనై యిట్లు లభిలషించితిని. పూర్వమునుండి యుండిన బంధము ననవసరముగ ద్రెంచుకొనలని యిటు వ్రా యుచున్నది. త్వరలో మఱియొక లేఖ రాగలదు."

మీ మైత్రి నభిలషించు,
చోళ సర్వసేనానాయకుఁడు
వీరరాజేంద్రుఁడు.

"దీని పైననా మీ రన్నియూహాలఁ దలంచితిరి"

"కాదుకాదు, ఇదిగో నును. దీనిఁ జదువుము"

మరల నతఁడిటు చదువ నారంభించెను.

ప్రియమిత్రునకు,

నీవనపత్యుఁడవని యెఱింగియు, నన్యవనితాన్వేషణము లొనర్చుటఁ దెలిసియు మాసోదర తనయను రూపాతిశయ విజిత సురలోకసుందరీబృందను, మధురాంతక నాకె సోదరు నితో నంపుచుంటిని. వీరు హంతకులచే నపహృతులైరని నాసోదరుని తలంపు. పదునైదు దినములలో వారు మీ పొలిమేరఁ జేరఁ గలరు? తగిన పరివారముతో వారిని రహస్యముగ గొని సాధ్యమైనంత త్వరలో వివాహమాడునది. ఈ కార్యమును గమనించియైన నాకు నీయెడఁ గలుగు విశ్వాసమును గమనించి మనఃపూర్వకముగ సాయ మొన ర్చుట కొడంబడవలయును. నాలుగైదు మాసములు గడచు లోపల తుంగభద్రాతీరమునకు సైన్యములఁ దీసికొని పోవ సంకల్పించుకొంటిని. వీలైనంత వఱకు సైన్యాభివృద్ధి నొనర్చి యుంపవలసినది. ఈతూఁటి పశ్చిమ చాళుక్యులు రూపఱవలయును.

నీహితైషి,
వీరరాజేంద్రుఁడు"

"రామసింహా! ఇందుల కేమందువు"

"మీచిత్తము వచ్చినటు మెలఁగెద నందును"

"ఇప్పుడొకటి చేయవలయును. పదుగురు భటుల కృష్ణానదిని దాఁటి యావచ్చు మధురాంతకదేవిని రాజరాజును, నిశాప్రయాణముల నిటఁ జేర్చవలయును."

"ఎవరు నేనేనా?"

"నిను మించిన సమర్థులేరీ"

"ఇంకను నాలస్యము గలదు గదా"

"అదియే గట్టిచిక్కు. ఆ ద్వితీయ లేఖఁగొనివచ్చిన పురుషుఁడు మార్గమధ్యమున నాఁగవలసివచ్చుట నిఁకనొక్క దినములో వారు విజయవాఁడ కరుదెంతురు. శీఘ్రముగ వెళ్ళవలయుననిన నీవసమర్థుఁడవు"

"మీయాజ్ఞ కన్యథావర్తింప నెంతటివాఁడను"

"మహారాజా! నేదెల్పలేదా? రామసింహుని మించిన కార్యశూరుఁడు, వివేకి మన వేంగిరాజ్యమున లేఁడు"

"ఆ భూషణ కేమి లెండు. విజయసింహుని గొని పోవుదునా?"

"వలదు వలదు. వాఁడు సింహపురినుండి వచ్చిన దాదివిడక యాలోచనాసక్తుఁడై యుండెను. యువకుఁడైన యాతఁడా కార్యమునకు సమ్మతింపఁడు. సహజపరాక్రమ ధురీణుఁడవగు నీకాతని సహాయమెందులకు? పొమ్ము. ఇందు సహాయమెందులకు? ఆ వచ్చెడివారు నిను దెల్పుకొనిన మాత్రమున వెంబడింతురు?"

"చిత్రము."

సంభాషణమునుబట్టి విజయాదిత్య నారాయణభట్ట రామసింహులు పాఠకులకు దెలియనైరి. తదితరులు రాజకీయోద్యోగులు. వారు వినుటకేగాని మాటాడ వచ్చి యుండలేదు. రామసింహుని మానసము డోలాయమానమై యుండినది. దానిని మహామంత్రి తనవాచా చమత్కృతిని తనవైపునకు ద్రిప్పుకొనియెను. అతడు విక్రమునంతటి వీరుడు గాకపోయినను రణాంగణమున వెనుకంజవేయని ప్రతిభాశాలి. ఆశావిష్టుడు గాకుండినను యశోభిలాష గల పూరుషుడు.

అతఁడు రాజమంత్రులకు నమస్కరించి వెనుదిరుగు లోపల నొకచుఱియ తాటాకుచే జుట్టబడినదై యాతని ముందుబడెను. చకితుఁడై యా వీరాగ్రణి దాని గంపిత హస్తుఁడై గైకొనియెను. అందు

"వీరాగ్రణీ! రామసింహా!

ఎంతటియవివేకివి. నీజనకుని ద్రోహమును బాటింపక నిను దగ్గఱతీసిన రాజరాజనరేంద్రుని రాజ్యము నొక సామంతరాజ్యముగ సలుప నిచ్చగించితివా? దేశభక్తి యింతకరుదెంచెనా? నీ రక్తనాళములందు స్వేచ్ఛయనునది ప్రవహించుటలేదా? అయ్యో! చాళుక్య రాజ్యరమా! ఎంతటివారల గనిన నీవు దాస్యము సలుపవలసి వచ్చు చున్నది. ఓయి వీరుఁడా! నాఁడు ఆచార్యవర్యుఁడధర్వణా చార్యులుగలసియుండనీవు రా వారు స్వేచ్ఛనుగుఱించి యెంత

గంభీరముగ నుపన్యసించిరి. ఆనాటి నీయుద్రేకమునటనయా? వలదు. వీరి కుత్రిమోపాయములకు లొంగకుము. సైన్యాధిపత్యము వదలుకొనుము.

నీహితైషి,

'వనకేసరి' అనియుండెను.

అది చదివి రామసింహుడు విభ్రాంతుడై పోయెను. అతని ముఖభావముల గమనించుచుండిన నారాయణభట్టు దానిగొని చదివి "రాజచంద్రా! ముందీ 'వనకేసరి' ని బట్టవలయును. వీడనవసర జోక్యమును మన కార్యములందు వహించుచున్నాడు. ఓయీ! మూరు లెండాతడిటనే యుండవలయు. రాజభవన రక్షకులతో నెవరినిగాని వెలికేగనీయరాదని యంతఃపురమనియైన గమవింపక గదులనన్నిటి బరికింపుడు. సజీవునిగనైన నిర్జీవునిగనైన వానిఁ గొనిరావలయును" అని యాజ్ఞాపించెను. అతఁడే రాజను సందియమును నూటెనులు వినిన నందకపోరు.

ఒక వికటాట్టహాసము వినఁబడుటనా వనకేసరి యటనే యుండెనని తెలిసి యా నియోగిత్రయము వెనుకంజ వేయుచుండెను. రామసింహుడు వాలు వెఱికి ముందుకేఁగ వారాతని ననుగమించిరి. ఒక్కింత వెనుకగ నారాయణభట్టు పోవుచుండెను. ఆ విశాలంపుగది కవాటమును లాగిరి. అదిరాలేదు. ఆనలువురు తమబలము నుపయోగించి లాగ తటాలున దెఱచుకొనుట వారొక్కింత స్థూలకాయుఁడగు మంత్రిసత్తముని పైబడిరి. వారిని వెన్నాడు విజయాదిత్యుఁడు

వారుతగులకయే కూలబడెను. భయము కారణమేమో! వారు గది నిర్గమించు నప్పటికి వనకేసరి యొక్క మలుపు తిరుగుటను గమనించిరి. వారిట కేగునప్పటికట నెవ్వరును లేరు. అందులో నొకరు రాజసౌధ పాలకుల కెఱుక పరుప పరుగిడెను.

ఒక పాతికగడియలో నా భవనము రాజభటులచే చుట్టబడెను. ఒకరైనను వెలుపల కేఁగ కూడదను శాసన మొనర్పఁబడెను. రాజాంతఃపురము నిశ్శబ్దమునకుఁ దావల మయ్యెను.

## ఏకాదశప్రకరణము.



"మాధవ నీదయారసము మమ్ముల జేరగ నీవ చేలనో !
సాధిత భక్తి నిన్ను మనసార నుతించుట నాలకింపవో"

"ఎవరిది యటుల శబ్దము చేయుచుండిరి ? విశ్రాంతి నందుట కిచ్ఛగింపరా !" అనుచు సారంగధరుఁడు దరహాస సుందరవదనారవిందుఁడై తన గది కవాటమును తెఱచెను. రామసింహుఁడు నియోగులతో నట ప్రవేశించెను. వారల హస్తములందలి కృపాణముల జూచి కంపితుఁడగుచు "ఏ ఏ ఏల - నే నే నేమి అ ప రా - రాధ ము సలిపితిని" అనెను.

"కుమారా! భయపడకుము. ఇట కెవరైనవచ్చిరా ? సారంగధరుఁడు దిక్కులు పరికించి "ఎవ రెందులకు వత్తురు ?

నాకవితవిన నెవరుగాని యభిలషించుట లేదు. అందు లకు నేనే—

"అదియుండనిమ్ము వనకేసరిని చూచితివా ?"

"ఆఁ— "అని యఱచి యెగిరి రామసింహుని గఱచుకొని "అయ్యో! ఆ కరిణుఁ డిట కరుదెంచెనా ? ఆ సర్పము రాజభవనముననే ప్రవేశించెనా ? ఇఁకేమిగతి ? రామసింహా ! దయచేసి వానిఁ బట్టివేయుమా ? నాకు నిద్దుర యనునది రాదుసుమా ! నీకు పుణ్యముండును, వాని బట్టు వరకు నాయసువులు కుదుట బడవు అయ్యో !" అని వగవ నారంభించెను.

"కుమారా ! భయపడకుము. ఈ నీ సేవకుని జీవిత ముండువఱకు నిన్నొకరును నొప్పింపఁజాలరు. నీజనకుని కృపారసము మఱచునంతటి కృతఘ్నత రామసింహుఁడు బడయలేడు." అని దరహాస మొనర్చి యచటి నియోగితో నింకొక గది నెమక వెడలిపోయెను.

రాకొమరుఁడొక నిట్టూర్పుబుచ్చి సహజదరహాసముతో

"సాధు లికేరుగాని నిను సాయము రమ్మని కోరు చుండిరో"

"రాకుమారా ! నీ నటనా కౌశల్యమునకు సంత సించితిని" అను కోమలనినాదము వినవచ్చెను.

సారంగధరుఁ డావైపు తిరుగ శయ్యకడనుండి మదాలస లేచుచుండెను. అటు చూచిన రెండు క్షణములకు

"తల్లీ! నమస్కారము. తనయుని కవిత వినుచుంటిరి కాఁబోలును. ఏమి వాత్సల్యము."

"ఆ సంబోధన మానగోరి వత్సరమయ్యెను."

"అది మానుటెట్టుల?"

"నావాంఛ తీర్చుటవలన"

"శోధన సల్పగాఁ దలఁచి సుంతయు నస్గనకుంటి వేమొకా"

"నన్ను మఱింత మరులుకొల్పు టెందులకు?"

"ఇటు వినఁ డాశువు."

"మాధవ నీదయారసము ♦ మమ్ములఁ జేరఁగనీవ దేలనో
సాధితభక్తి నిన్ను మన ♦ సార నుతించుట నాలకింపవో
సాధు లికేరుగాని నిను♦సాయము రమ్మని కోరుచుండిరో
శోధనసల్పగాఁదలచి ♦ సుంతయు నస్గకుంటివే మొకా.

ఎటులున్నది, నిషిద్ధాక్షరికంటె నిది కష్టమయ్యెను. భావములే సంపూర్ణముగ మాఱిపోయినవి. ఏమి చేయగలను?"

"సారంగధరా! వియోగులనేచు సారంగధరనామము నీకుఁ గలుగబట్టియా ఈకాఠిన్యత. మోహనాంగా! నీకవిత నెవరికిఁ గావలయును? నీ కవిత, నీ సౌంర్యము, నీశీవి దలంపని క్షణము నాజీవితమునందేది? అయ్యో! మార సుందరా? ఏల యీకాఠిన్యము. గానవిద్యారస పారీణుఁడవగు నీ కింతటి పాషాణ సదృశ హృదయ మేల ధాతయొసంగెను?

మనోహరా! నీకొఱుకుగదా? ఆలేఖను జూచియు నానాథుఁడు నన్నపహరింప చోరనాయకునకు ధనమొసంగెనని తెలిసియు నిట కరుదెంచితిని. నీ వదనేందుమండల మరీచీ జాలములఁ జూడనిదినము దుర్దినమని భావించితిని. నీవాక్సుధ దూరము నుండియైనఁ విననిది శాంతియన నెఱుంగ కుంటిని. సారంగధరా! ఆనాఁటి నీచిత్తరువును హృదయమునకు పలుమాఱు హత్తుకొనని దినమున్నదా? ఎందులకింత కఠినుఁడ వైతివి. నీభీరుతానటనమైన నను మోసగింప దయ్యెను. నీవు నిరక్షర కుక్షివై భిక్షుకుఁడవై యుండినను నినుమానియుండనుసుమా! ఓయీ! సారంగధరా! ననుగాపాడుము. నీపైని మోహమున వివశమై దర్పకునసర్గళాస్త్రములచే విచ్ఛిన్నమైన యీతనువు నీవేలరక్షించి మానినీ ప్రాణరక్షణ లాభము నందవు!"

అనుచు నా బింబాధరి మోకరించి నిమీలిత నయనయై బాష్పోద బిందువులు నునుచెక్కులపై బ్రవహించుచుండ నా రాకుమారుని జూచుచుండెను. సారంగధరుఁ డావనిత వాగ్జాలమునకు విభ్రాంతుఁడై పోయెను. ఎటులాడుట కును దోఁచక స్తబ్ధుఁడై నిలచియుండి యెట్టకేలకు

"జననీ! వాచాదోషమున కేల గడంగెదు? ఇయ్యది దుర్వాంఛ; వదలుము. క్షణకాల సుఖమున కాసించి, తల్లీ! చిరకాల యమయాతనాసహనమున కేల యత్నింతువు? అమ్మా! నీ వేనాఁడు నాపితృవ్యుని జెట్టబట్టితివో నాఁడేపూజ్యవైతివి. నన్నేలయిట్టికలుషవాక్కులచేబలుమారు

బాధింతువు? మాతా! నీవనినటుల నేను నిను సంకటపఱచుటలేదు. నీవే నాకు మనశ్శాంతి లేనటు లొనరించితివి"

"ఏమీ! నన్ను గుఱించి నీకు మనశ్శాంతి లేదా? ధన్యను, సారంగధరా! ధన్యను. నాపై నామాత్రము తలంపు గలిగి యుంటివా!"

"మాతా! పొరబడకుడు. మీ రూపమును సహగమన మొనర్చిన మాతల్లి రూపముతో బోల్చుకొంటిని. నా యిష్టదైవమును మీ మనస్సు మార్ప వేయివిధముల బ్రార్థించు చుంటిని"

"అయిన నావాంఛ—"

అని పరభృత తిరస్కృత స్వరమై విపంచీ నినదంబు నధఃకరించు కంఠమున రోదన మారంభించెను. సారంగధరుని ముఖము వెల్లబారెను. అదిగాంచి యాకరతలోదరి వాని నాలింగన మొనరింపఁబోయెను. రాకుమారుఁడు నాఁకటిన ముగ బ్రక్కకుద్రోసి "తల్లీ! వదలుము." అని మృదుగభీరముగ పలికెను.

మదాలస విధానము మారిపోయెను. ప్రణయమధుర ములగు నయనములు రక్తిమములై నిప్పుకలగురియసాగెను. అధరము కంపింప సాగెను. వక్షోజము సంక్షుభితమయ్యెను. ఔరా! ఏమి కలవాణుల విధానము.

మంజులాలాపములు వలుకునోట శాపములు బయలు దేఱును. పరిష్వంగ మభిలషించుచునే వినాశమును

వాంఛింతురు. ప్రేమ దృక్కుల ప్రసరించు నేత్రము లగ్ని కణముల వర్షించును. మరువిల్లులఁ దలపించు బొమలు, ముడివడిన చీకటిని జ్ఞప్తిపఱచును. అబలలు, బాలలు, కోమ్మలు, లతాంగులు, భీతహరిణేక్షులని కవులు పొరబడి వాడుచుండవలయును. అంత కర్కశస్వరమున,

"సారంగధరా! నన్నెల్లవా?"

"మాతా! సహస్రనమస్కారము లటులాడకుము"

"ఇఁక నీవు లేనివాఁడవే?"

"చిత్తము"

"నీ ప్రచ్ఛన్నత, నీ వనకేసరిత్వము బహిరంగ మొనరింతును."

"ఏమి, ఏమనుచుంటిరి. వనకేసరిత్వమా? మాతా! మీయభిమానమేమి?"

"ఛీ! వదఱకు. ఎవరికడ నీచమత్కారము. ఇఁక మదాలస నీవగలకు బేలుపోవునది కాదు. ఇదిగోయీక్షణమే నీగుట్టు బయల్పఱతును. నిను మరణ శిక్ష నందజేతును. ఆ నీ కోమలాంగకములు ధూళి దూసరితముల నొనరింతును. క్రోల్పులితోనైన వైర మభిలషింపవచ్చును గాని నాతో విరోధమా?"

"అమ్మా! నావన కేసరిత్వమునకు సాక్ష్యమో"

"సాక్ష్యమా! క్రూరుఁడా! ఇంకను మోసగించుటయా! నీధరించిన వస్త్రములను జూపిన."

"ఆఁ—అటులనా? ఏదీ? రెండు చూతురుగాని. మీరీనాఁ డుద్రేకపూరితులైతిరి. శాంతింపుఁడు."

"ఓరీ! పాషండా! శాంతమా? నీ యసువులు వధ్య శిలకడ బోయినప్పటికి గాని శాంతియనునదిలేదు"

"అమ్మా! తనయుని మరణము తల్లియే కాంక్షించు నంతటి యదృష్టము. కానిమ్ము"

"ఓరీ! వగలమారీ! నీమాటల కిక బేలుపోవనలేదా? రమ్ము నీప్రచ్ఛన్నతను వీటిబుచ్చి నినుజంపింపఁజేతును"

సారంగధరుఁడు పలుకకుండెను. కంపిత గాత్రయగు మదాలస యటనుండి కష్టముపైఁ గదలి యొక పేటికను డాసెను. అద్దానిఁ దెఱచి యందలి వస్త్రములను బయటవైచెను. అందు వనకేసరి ధరించిన రక్తాంబరములు గాని యాతనివాలుగాని లేకుండెను.

"తల్లీ! పొరబడితిరి. వనకేసరికుండిన శౌర్యములో నాఱవపాలు నాకుండిన యెన్నడో యిచ్చోటువాసి యరిగి యుండనా?"

"నే కన్నులార జూచితినే!"

"భ్రమ పోనిండు! పోయివిశ్రమింపుఁడు. అలసితిరి."

"సాంగధరా! అంత కనికరమున్న వాఁడవు నీ బాహువల్లరుల విశ్రమింపనిమ్ము. నాకెనవాక్కుల గణింప కుము. రాకుమారా! నీయధరమును—"

"అబ్బా, తల్లీ! నారాయణ! నారాయణ!"

"అయ్యో! సుందరా! ననురక్షింపుము." అనుచు నిలువున కూలఁబడెను.

సారంగధరుఁడు విభ్రాంతుఁడై పోయెను. ఆయువతి యచేతనయగుటకు భయంపడెను. సమీపమందలి జల కలశమును గొనివచ్చి యాయువిద బాష్పముల గడగి కపోలమును, గండస్థలములను శీతలోదకముచే నార్ద్రము లొనరించెను అటు లొనర్చుటలో నాసుగంధతైల సంసిక్తమగు నాశిరము నంకపీఠ నుంచుకొనియెను. వానివదనమా యరవిందదళేక్షణ వదనముండాసెను. వాని హృదయము తహ తహ లాడుచుండినది. తన పితృవ్యసతి తన వలన వినాశము నొందునేమో యను భయ మాతని బాహ్యజ్ఞాన శూన్యు నొనరించెను. యువతుల దైహిక పరిస్థితుల నెరుంగని రాజరాజనరేంద్ర తనయుఁడు శీతలజలము నూరక జల్లు చుండెను.

తటాలున మదాలస తన కరములచే నాతనిశిరమును వంచి తనివితీర ముద్దాడి యాతన్మయతవలన మూర్ఛిల్లెను. సారంగధరుఁడు మదాలస నటన గుర్తింపనివాఁడగుట వలన విభ్రాంతుఁడైపోయెను. ఉష్ణములగు నోష్ఠముల స్పర్శనమున నాతఁడు తత్తరపాటునంది మూర్ఛితయగు మదాలస శిరము గ్రిందబెట్టి నిలువఁబోవుచుండెను.

"ఓరీ! అంతఃపురద్రోహీ!" అనుమాటలు కశాఘాతములవలె నాతని చకితు నొనర్చెను. అటుచూడ

నారాయణభట్టద్వితీయుఁడై యూమదవడల పితృవ్యుఁడు నిలచియుండెను.

"కులోత్తుంగా! నీవలన మావంశమున కపకీర్తి కలిగెను." 'తులసి మొక్కలనడుమ కంటక వృక్షమవై' యెటుల దాపురించితివి. అట్టిసోదరునిఁ గోల్పోయినది నీఁబోటినీచుని గాంచుటకా? నీకు స్వాతంత్ర్య మొసంగుట యిందులకా? జనని విషయమునసే యపచార మొనర్చిన పరమపాపివి. ఛీ! నీముఖము చూడరాదు. నారాజ్యము నుండి కదలుము."

"పితృవ్యా! మీరింతగ నాయూనపడ నవసరములేదు. మీయాజ్ఞ జవదాటను. ఇదె మీభూమి వదలువాఁడను. వదలిపోవుట మీయాన ననుసరించికాని దోషినై కాదు. ఆ మానవతి విషయమున నే ననపరాధిని."

"చాలును. ఇఁక మాటాడవలదు. ఇఁకనాసతి నీపైఁ బడ నరుదెంచెనని చెప్పఁబోవుదువు జాగ్రత్త."

"పితృవ్యా! మీరు నాస్వభావ మెఱుంగనందులకు విచారమయ్యెడిని. అయినను నష్టములేదు. ఇదె మీసతీ మణిని గొనిపొండు. ఒక గడియకుపైగా మీరాజ్యమున నను జూడఁజాలరు" అని యుచటుబాసెను.

నృపసచివులు నవ్వుకొనుచు దాసీజనమును బిలిచి, మదాలస నామె శయనాగారముఁజేర్ప నాజ్ఞాపించి వారును వనకేసరి యన్వేషణఫలితము గనుఁగొననేఁగిరి.

సారంగధరుఁ డంతఃపుర ద్రోహ మొనరించుట దేశ భ్రష్టుఁడయ్యెనని పురముసఁ దెలిసిపోయెను. పౌరులందు స్వతంత్రవాదులగు వారును, రాజరాజ నరేంద్రునిపై నభిమాన మమితముగఁ గలవారును, నాక్షేపణా సూచకములగు వాదముల నటనట సలుపుచుండిరి. ఆకాలమున 'నావిష్ణు పృథివీపతి' యనుమాట ప్రజలకు వేద్యమాగుడు నాక్షేపణలు రాజు చెవి కెక్కకుండునట్లు లోనరింపరైరి. అటులొకటి రెండు వచ్చినను నారాయణభట్టు తన శాసనాదికములచే సారంగధరుని మానముచే ధనాదిక దానములచే మాయించెను. సమర్థుఁడగు సచివుఁడుండిన నేది కాదు.

## ద్వాదశ ప్రకరణము.



విజయవాడ గ్రామముకాదు, అట్లు పత్తనముగాదు. దాని నాయకుఁడు సామంతప్రభువు కాకుండినను పరాక్రమవంతుఁడే. అతఁడు విజయాదిత్యునకు మిత్రకోటిలోనివాఁడు. రాజరాజు మరణింపకుండిన, భుజబలసహాయమున రాజ్యమును మిత్రునకు నాక్రమించి యొసంగ నిర్ధారణ మొనర్చియుండెను. ఆతఁడు రామసింహుని రాకను దత్కారణమును విని చాల సంతసించెను. ఒకరిద్దఱు భటులతో సరుదెంచిన యాచాళుక్య సేనానికి పదుగుర వెంటనిచ్చి భవిష్యచ్చాళుక్య రాజ్ఞి తగు నాడంబరమున నెదుర్కొనఁబడ వలయునని వచించెను.

నావ సిద్ధపఱుపఁబడెను. రామసింహుఁడు పరివారముతో దాని నధిరోహించెను. పవమానుఁడు సౌమ్యుఁడై యుంటవలన, నావకృష్ణానదిని సుఖముగ దాటెను. ఆకాలమునందు కృష్ణానది దాటిన పిదప దక్షిణమున నిబిడారణ్యము శతక్రోసులు వ్యాపించియుండెను. ఆయరణ్యమునందొక్కంత భాగము పల్లవుల యధీనమందుండినది. కాన చాళుక్యసేనాని యెట్టి భయమునుగాని చెందక పయనముసాగించుచుండెను.

పల్లవుల పొలిమేర నొక బోయపల్లియ యుండినది. అక్కడికేఁగునప్పటికి వారువము లలసి యుండబట్టియు, సాయంకాలము కావచ్చుటంబట్టియు నట విశ్రమించిరి. నాగరకుల రాకవలన నాటవికు లన్నివిధముల సౌకర్యముల గల్గించిరి. విశాలమగు గుడిసెయొకటి రామసింహుని యధీనమొనరుపఁబడెను, ఇతరులు సమీపపుటిండ్ల విడిసిరి. రామసింహుఁడు పల్లియవదలి కాననమందలి సూర్యాస్తమయశోభ పరికించుచుండెను. అంధకారము వ్యాప్తమైన పిదప గ్రామమును బ్రవేశించి యాటవికులొసంగిన యాహారమును గొని విశ్రమించెను.

చేతి కందకపోయిన వనకేసరి యాశవి హృదయమునం దనుక్షణమును నూతన సంకటమును గలిగించుచుండెను. అతఁడు వ్రాసినలేఖ యందలి ప్రత్యక్షరమును నాతని మనోవీధిని ప్రతిబింబితమై యుండినది.

స్వతంత్ర రాజ్యమగు పూర్వ చాళుక్య రాజ్యము సామంతరాజ్యమగుటవలన నష్టము లేదని రామసింహుఁడు

భావించుచుండెను. సామంతత్వమని యనుటకును వీలుకలుగ దమ్యెను. నన్నపార్యుఁడే 'సఖ్యసంబంధములఁ జేసి చక్రధరుఁడు ద్రుపదుడును అరినొసంగి' యుండలేదని వ్రాసి యుండెను. అట్టిచో చోళరాజు కన్యను వివాహమాడగల విజయాదిత్యుఁడు సామంతుఁడెట్లగునని యాతనియూహ. ఏదియెటులుండినను చోళులతోఁ గూడి పశ్చిమ చాళుక్యుల జయించుట నిజభుజబల మగుపఱుపఁదగిన యదనని యాతఁడు భావించి యుండెను. శస్త్రోపజీవికి రణాంగణ విహారమున నందును విజయమును విశ్వసింపదగిన పక్షమున బోరుట కంటెను వాంఛనీయ ముండునా ?

మఱి వనకేసరి యెవరు ? ఆతఁ డట్టి పౌరుషఖనియై యుండియు నేరాజు నాశ్రయింపక యేకాకియై యుండ నేల ? రాజనారాయణ బిరుద మందఁ గలిగిన యా వీరునకు పూర్వచాళుక్యులతోఁ గల సంబంధ మేమి ? రత్నసింహు నడంచుటయు విజయాదిత్యు నవరోధించుటయు నతఁడు విని యుండెను. అట్టి యాచరణములకుఁ గారణ మేమైయుండును? ధర్మపథావలంబియగు నా పురుషుఁడు స్వయముగ నొక రాజ్యము స్థాపించుకొనక కాలము వ్యర్థపఱుప నిమిత్తమేమై యుండును ? ఎంత విచారించినను వనకేసరి నిగూఢ ప్రవర్తనకు నిమిత్తమాతఁడు గ్రహింపఁ జాలకపోయెను. రాజమహేంద్రవరమును జేరిన పిదప వాని వృత్తము నెఱుంగ ప్రబలయత్న మొనర్పవలయునని యాతఁడు నిశ్చయ మొనరించుకొనెను.

భానుఁ డుదయించిన రెండుగడియల వఱకు నాతఁడు మేల్కాంచి యుండలేదు. భాను కిరణములే యాతనిఁ ప్రబోధితునొనరించెను. సాతురుఁడై లేచి తనను మేల్కొలుప నందులకుఁ దనవెంట నరుదెంచిన వారిని చీవాట్లు పెట్టి కాల్యములఁ దీర్చి యాపల్లియను వదలి యటవినిదాఁటి వేచి యుండెను. మధ్యాహ్నమైనను చోళులయాగమనంపు జాడ పొడకట్టదయ్యెను. వన్య ఫలములచే క్షుత్తుఁ దీర్చికొని సాయంకాలము వఱకు వేచియుండెను. ఫలములేదయ్యెను. ఒకరిద్దఱ ముందు పల్లెల కంపి మరల తానా బోయపల్లెను జేరెను. ఆ నిశి నెటులేని గడపి వఱువాత లేచి మరల పూర్వదినస్థిత ప్రదేశమున నుండిపోయెను.

మధ్యాహ్న మగునప్పటికి తానంపిన భటులరుదెంచి చోళుల యాగమనమును దెలిపిరి. అంత నొకింతసేపటికి పదుగురు చోళులు పల్యంకికల రెంటిని గొని యట కరుదెంచి గమనాయాసమును జూపు చోళులతో నట నొకటి రెండు గడియలు విశ్రమించి చరమ దిశాంగనఁ జేర భానుఁడు బోవు సమయమని భావించి పయనము సాగించిరి. పల్యంకిక లుండుట వలన నంధకారము భూభాగమునందు వ్యాప్తమగు నప్పటికి బోయపల్లియను జేరిరి.

పల్లకులు రామసింహుం డుండిన విశాలకుటీరమునం దుంపఁబడెను. ఆటవికులు రాజవంశమువారి రాకను దెలిసి మృదులములగు నాహారముల సిద్ధపఱచి యటకుం

గొనివచ్చిరి. రామసింహుఁడు భయ వినయములు ముప్పిరి గొన సహజంపు రాజభక్తి పిక్కటిల్ల పల్లకుల కవాటముల దెఱచి విభ్రాంతుఁడై పోయెను. అందు ముసలి దంపతు లుండిరి. మధురాంతక రాజరాజు లెటపోయి యుందురని తోఁచినంత నాతని గుండియ ఝల్లుమనెను. దేహము కంపిత మయ్యెను. విజయాదిత్య నారాయణ భట్టులను దలంచి వారికేమి సమాధానముఁ జెప్పవలయునా యను విచారము ఘనమైపోయెను. వనకేసరివాక్యముల వలన దాను కార్య భంగ మొనర్చెనని వా రెక్కడ తలంతురోయని యాతఁడు భయపడ సాగెను.

భటునొకని బిలిచి చోళులలో నాయకుని బిలువ నాజ్ఞాపించెను. వాడేఁగి పది క్షణములలో నరుదెంచి వారెవ్వరు అగుపడలేదని తెలిపెను. రామసింహుని హృదయ మాగిపోయి నటులయ్యెను. దిక్కుదోఁచక కూర్చుండెను. అదంతయు వనకేసరి కారితమని యాతని యంతరాత్మ కెవరో తెలిపినటు లుండెను. తా వచ్చినప్పటికి రాజ మహేంద్ర వరమునందు దాగియుండిన వనకేసరి యదంతయు జేయు టసంభవమని యాతఁడు భావించెను. "ఓరీ! ఎవ రచట?" అని యనబోవ "రామసింహా! నామాటల వినని ఫల మనుభవింపుము." అను వారిద గంభీర స్వనము విన నయ్యెను. అతఁడటుచూడ ద్వారముకడ ఖడ్గహస్తుడై వన కేసరి నిలచియుండెను. భ్రాంతియని రామసింహుడది విశ్వ సింపక పోయెను. కాని వనకేసరి సమీపించినంత నిజమని

యెఱింగి తా నెఱుఁగకయే యొరనుండి కత్తినిలాగెను. వనకేసరి హాసమొనరించి యాసేనాని కరవాల కరమును బట్టుకొనెను. మహా బలశాలియని పేరువడసిన యాతఁడు ప్రౌఢునిచే బట్టుకొన బడిన బాలునివలె విడిపించుకొన నశక్తుఁడయ్యెను.

అట్టిసమయమునం దితరు లేమిచేయుదురో సేనానియు నటులే యొనరించెను. తన పరివారమునకు కేకవేసెను. వారొక్కపెట్టున లోనికఁగుదెంచిరి. వనకేసరి వికటముగనవ్వి రామసింహుని కరవాలము లాగుకొని, "ముందుల కొక యడుగు వేసితిరా మీనాయకుని జీవనము హుళక్కి యని యెఱుఁగుఁ" డనెను.

విజయవాడ భటులలో నొకఁడు ముందున కరుదెంచి ముంజేయి పోఁగొట్టుకొనెను. అంత రామసింహుని వారి కడకుత్రోసి, "కానిండు. నా కరవాలము మీ రక్తము చవిచూడ గోరుదురేని నేనేల వలదనవలయు" ననెను. చేయి నఱికించుకొనినవాని కైదువు కరమునఁ గొని సింగపుఁ గొదమభాతి రామసింహుఁడు వనకేసరిపై దుమికెను. వనకేసరి ప్రక్కకొక్క యడుగువైచి రామసింహు కాళ్ళ నడుమ కాలునుంచి త్రోసెను. ఆత్రోపున కా సేనాని మృత్తికా కుడ్య సమీపమునం బడి యంతలో లేచి వనకేసరిపై కరుదెంచెను. వాని పరాక్రమమునకు మెచ్చుకొని వనకేసరి ఖడ్గద్వయమున భటులను సేనాని నొకేమా రెదిరించెను. ఎవరికిని దెబ్బ తగులలేదు.

తన కత్తులతో వారల వెనుకకు తరమెను. వారుపురల తటాలునపైకిరా వారి మధ్యభాగమునుండి నాలుగడుగులు వెనుకకరిగెను. దానివలన భటులును సేనానియు సంఘర్షణమైరి. సేనానివాలు విజయవాడ భటునిలోనికి దూసికొని పోయెను. దానిని బలముగలాగి రామసింహుడు వనకేసరిపై విసరెను. వనకేసరి తన కరవాలమును క్రిందుగ రానిచ్చి దానిఁగొట్టెను. పిడివఱకువిఱిగి యది మఱియొక భటునికిఁ గ్రుచ్చుకొనెను. వనకేసరి వామకరమందలి వాలుతో నొక భటుని ఏమరుపాటునరా జూచువానిఁ బడవైచెను.

వాని కరమునందలి క్రైదువును రామసింహుని కడకు త్రోసివైచి భటులవైపు ముమ్ముకుటచే వారందఱును కవాటమునుండి వెలువడిరి. రామసింహునిపై యూసవదలుకొని వారు పఱుగిడిరనినచో సత్యమునకు దూరముగాదు. రామసింహ వనకేసరు లొక్క యఱఘడియకాలము పోరాడిరి. వనకేసరి కొక గాయమును రామసింహునకు మూఁడును దగిలెను. చాళుక్యవాహినీపతి యలసిపోయెను.

వనకేసరి పల్లకిలోని యొక వస్త్రమును నీటఁదడిపి గాయమునకుఁ గట్టుకొనుచు "రామసింహా! నా యస్త్రవిద్య యెట్టిదో యెఱింగితివికదా? మీరాజు కాముకుఁడు. పల్లవ రాజతనయ విషయమున సల్పిన యత్యాచారమును విని యుందువు. జితేంద్రియులుగా నుండవలసిన రాజులు వివాహముకాని యువతుల విషయమునం దట్లు ప్రవర్తింప

నగునా? విచారింపుము. రాజకార్యతంత్రముల నెఱింగని యాతని సేవించుటయగాక స్వాతంత్ర్య మనుభవించు భూమి నొకనికిలోఁబఱచు టేటి న్యాయము? పోనిమ్ము. నాకెందులకు? నీ వభిమానివనియు, దేశభక్తుఁడవనియు హెచ్చరించితిని గాని ఫలములేనయ్యెను. పర్వతాగ్రమునుండి పడువాని నెవరాపగలరు? దేశముతోబాటు మీరును నాశనముకందు. మీ మేలికపై నొకానొక కారణమున కత్తి నెత్తనైతిని గాని లేకున్న నీపాటి కతఁడేమైయుండునో దైవమున కెఱుక. అది యుండనిమ్ము. ఈలేఖను గొనుము. మీ రాజచంద్రున కొసంగుము. ఈ కార్యమునందు నీదోస మిసుమంతయు లేదని యట వ్రాసియుంచితిని" అని యొక తాళపత్రము నటవైచి వనకేసరి యథేచ్ఛ నరిగెను.

రామసింహుఁడు కష్టముపైఁ దనభటుల రప్పించి వారిచే గాయములఁ గట్టించుకొని యాలేఖను జదువ నారంభించెను.

"చాళుక్యరాజచంద్రునకు నమస్కారములు.

మీ రేవాంభతో మధురాంతకదేవి రాక కొనం దింతురో వాసంతికవిషయమునఁ దమ ప్రవర్తన నెఱింగిన నాకుఁ దెలియును. మధురాంతక రాజరాజుల నాకారణమును బట్టి నాకడ నుంచుకొనదలంచితిని. బహు భార్యాపేక్ష వలదనను కాని ధనమును అధికారమును ప్రేమించు వనితల నెందఱనైన గ్రహింపనగును. ముగ్ధలమనను స్వాధీనపఱచు·

కొను శక్తులందొకటియైన మీకడ లేదని యనినందులకు క్షమింపవలయును. మధురాంతక రాజరాజు లపహరింపఁబడిన రెండవదిన మా పల్లకుల మీ సేనాని జూచెను.

మీరిఁక పారమార్థిక చింతతోనుండిన నెల్లరకు మనశ్శాంతి కలుగును. మీ సచివ శిఖామణి రాజకార్యముల పరిచూచుకొనును. మీ కెందుల కాయాసము? మీనుండి యువతుల తప్పించి నందులకు క్షమాపణము వేఁడు

'వనకేసరి'."

రామసింహుని మనోభావముల స్థితి మనకవసరము లేదు. మఱి నాలుగుదినముల కతఁడు రాజమహేంద్రవరము సేరెననియుఁ దఱువాత రెండుదినముల కుద్యోగమును వదలుకొని మిక్కిలి యాప్తులగు నూర్గురు భటులతో దక్షిణముగ వెడలిపోయెననియుఁ దెల్పిన చాలును. బళిరే! మానధనుల ప్రవర్తనము! అభిమానము, ఆత్మగౌరవములేని పురుషుఁడు నిరర్థకజీవనుఁడని పాఠకులు గ్రహింతురు గాఁబోలును.

## త్రయోదశ ప్రకరణము.



" విజయా! నామైత్రి పాటించియైన నా వెంట రాఁగూడదా?"

" ఎందులకు?"

" పరాక్రమఖనివగు నీ సామీప్యమున నిర్భయముగ నుందును?"

"సారంగధరా! వీరకులోచిత భాషణములు నీకడ లేకపోయెనేయను విచారము నాకెన్నఁటికి పోవునో కదా ?"

"పోనిమ్ము. నాజీవితమునందు రాజకీయసౌఖ్యములు వ్రాయఁబడి యుండలేదు. నాకెందులకు పౌరుషము ?"

"అగేల యటులంటివు. మన గురూచార్యులవా రీవు చక్రవర్తి వౌదువని తెలిపియుండరా ?"

"వారు వాత్సల్యాతిశయమున నటులనియుందురు. చూడుము. వీరాధివీరుఁడవగు నీవు నావైపైనను జూడకుంటివి. రాజ్యాధికారము నాపినతండ్రి వహించియుండుటచే నిఁక నేరి సహాయమునన్నైన రాజ్యము సంపాదింప నిచ్ఛగింపను. కాఁబట్టి సార్వభౌమత యటులుండ కడకు నల్ప రాజ్యాధికారమైన నానుదుట వ్రాయఁబడియుండలేదు."

"ఇపుడు యమరావతి పట్టణమునందేమి చేయుచుంటివి?"

"ఈ పురిపాలకున కొకటి రెండు చిత్తరువుల వ్రాసి యుంటిని. నీ యభిప్రాయము దెలిసికొని పోనుంటిని."

"ఎటకు ?"

"విజయా! ఎటకని తెల్పుదును. పాలింప భూములు లేవుగాని భిక్షమెత్తుకొన తావులులేవే ?"

"ఏమీ ? నా యేలికతనయుఁడు బికిరమున కరుగుటయా ? నేను సమ్మతింపను."

"నీయేలిక యనపత్యుఁడు"

"ఇతఁడు నా యేలిక యెట్లగును?"

"మిత్రుని కోరికయైనను ద్రోసి సేవించుటవలన"

"మిత్రమా! విను. నేను నీశ్రేయము నభిలషించియే రానని తెలిపితిని. రాజమహేంద్రవరమునం దుండినచో పరిస్థితుల గమనించుచు నవకాశము లభించినపుడు నీయాగమనము నభిలషింతును. నీవెంట నరుదెంచితినా యిరువురము నుదేశభ్రష్టులము గావలసినదే! అదియుఁగాక పశ్చిమ చాళుక్యులపై యుద్ధము సంఘటిల్లనున్నది. అందు వీరరాజేంద్రుని మనసుకెక్క ప్రవర్తించి యాతనిమది కెక్కితినేని తప్పక నీవిషయము ప్రస్తావించి పల్లవ, పశ్చిమచాళుక్య భూములఁ గొన్నిఁటి నీకొసంగునటు లొనరింతును. అపుడు మన మిరువురమును సంతృప్తులమై యట వసింపనగును.

"మిత్రమా! విజయా! నీ యాలోచనాశక్తి ప్రశంసాపాత్రము. కాని నీయభిలషితము లీడేరవని దృఢముగఁ దెలుపఁగలను. వీరరాజేంద్ర చోళుఁడు నావిషయమునందు సంపూర్ణమైన మనస్యము నందియుండెను. త్రిపురనొకమాఱు చిన్నతనమున చిన్నపోసనపఱచి యుంటిని. ఆపు కంఠము స్త్రీకంఠమే కాదని పరిహాసించి యుంటిని. దాని కాతఁడు చాల మనసునొచ్చుకొనెను. మొదటినుండియు నాపై నతనికి వెగటుఁదనము వృద్ధియగుచునే యున్నది".

"పోనిమ్ము. ప్రయత్నము నొనర్చుటవలననష్టమేమి?"

"నీయిష్టము"

"నీవెట కేఁగుచుందువు!"

"ఏల ?"

"తెలిసి యుండిన మంచిది కదా!"

"ఓహో! రాజ్యరమను వరింప రమ్మనుటకా? వినుము. నేను మావంశమువాఁడగు నాహవమల్లుని జేరుదును. నాయసహాయస్థితి నెఱుక పఱచి సహాయ మభిలషింతును. అతఁడాశ్రితవత్సలుఁడని విందును. దయార్ద్రహృదయుఁడై యాతఁడొక వనదుర్గము నొసంగిన యందు నిరాటంకముగ కాలముగడుపుచుందును. నీవు నాకై శ్రమపడుచుందువు గాన యా నిరుపహతిస్థానమం దొక గ్రంథమును వ్రాసి నీ కంకిత మొసంగుదును లెమ్ము.

"అటులే కానిమ్ము. రాకుమారా! నా మానసము నందలి పేరాశ నీ కెఱుక పఱుపనైతిని."

"ఏమి వివాహమా?"

"కాదు. కాదు. రామసింహుఁ డుద్యోగమును జాలించుకొనియెను."

"ఎపుడు-ఎందులకు?"

"ఏదో వనకేసరి—"

"ఎవరు-రాజనారాయణ బిరుదమందిన యతఁడేనా?"

"ఆఁ—అతఁడే! దాస్యము వలన ఫలము లేదనియు, ఆతని యత్నము వలన చాళుక్యదేశ గౌరవము నశించు ననియుఁ జీవాట్లుపెట్టెనఁట."

"విజయా! ఆతఁడు నిన్నొకమాఱు చీవాట్లు పెట్టిన బాగుండును. విజయా! నీ వా రామసింహునిమాత్ర మభిమానముగలవాఁడవు కాకపోయితివా?"

"రాకుమారా! అవేటిమాటలు. ఆతఁడు మధ్యమ వయస్కుఁడు. నేను యువకుఁడను. సర్వసేనాధిపత్యము వలన నాతఁడొందులాభము లేదు. నేనో, నా ప్రియమిత్రుని, నా సహాధ్యాయిని, నాయేలిక యేకమాత్రతనయుని నైవాను గ్రహముండిన రాజును జేయఁగలను."

"విజయా! నీ వుదారహృదయుఁడవు. నీ యిష్టము వచ్చినటు లాచరింపుము. నాకై మాత్ర మసువుల త్యజింపకుము."

"ఇఁక నా రాజ భక్తియేమి?

"మీ జనకునంతవాఁడ వగుదువుగాక! మిత్రమా పోయివత్తును."

"రాకుమారా! నీ యునికిపట్టును మాత్రము దెలుపుము."

"మంచిది. నారాయణభట్టు విషయమున జాగరూకుఁడవై వర్తింపుము."

"నే నాతని యాప్తవర్గములోఁ జేరియుంటినని నీవు నమ్మవుగాఁబోలును. అందులకే సర్వ సేనాధిపత్యము వాంఛించుచుంటిని."

"నీకు జయమగునుగాక! వెళ్ళిరమ్ము."

అని యీ మిత్రులు విడువలేక యొకరి నొకరు పలుమా రాలింగన మొనర్చుకొని తమతమ త్రోవలఁజనిరి. పాఠకులు విజయాదిత్యునిచే దేశభ్రష్టుఁడైన సారంగధరుఁ డమరావతి కరుదెంచి యటకు మిత్రుని బిలిపించుకొని తనను వెంబడింపఁగోరెనని గ్రహించియుందురు.

అంత సారంగధరుఁడు పశ్చిమ ముఖముగ బయలు దేరి యొక పురమున నొకటి రెండు దినములుండి యటుగ భద్రానది శోభను బరికించుచు దానిని దాఁటి మఱి రెండు దినములకు వాతాపిఁ జేరెను. సైనికులచే నిండినయా పట్టణము సంద్రమువలె ఘోషనీనుచుండెను. ఆపురియందొక చోటనున్న దిన్నములుండి సైన్య సేకరణమునకై వెళ్ళివచ్చిన యాహవ మల్లుని సందర్శించెను.

ఆహవమల్లుఁ డేఁబది వత్సరములు దాఁటినవాఁడు. వీరాగ్రేసరుఁడగు నాతని యాకృతి దర్శనీయమైనది. ఆతని నయనద్యుతి ప్రకాశవంతమైనది. ఒకసారి యతఁడెవనిని వాని జూచినచో నాతని కన్నులలోనుండి తనచూపులఁ బఱపి వాని హృద్వీథినుండుభావములగ్రహింపఁగలడని చెప్పుదురు. వీరులకు సహజమగు నాశ్రితరక్షణమును, శత్రుజనహననము నాతనికడ నుండినవి. ఆశ్రయమిచ్చెనా సౌఖ్యమందఁ జేయుఁ గలఁడు. కోపించెనా వంశ నిర్మూలన మొనర్పఁ గలఁడు. సారంగధరుఁడు పోయినవేళ మంచిది.

ఆతని చరిత్రము, మదాలస మోహము లోపముగ, సర్వమును తెలుపఁబడెను. రాజరాజనరేంద్రుని విషయమున

నాహవమల్లుని గౌరవ మనుపమానము. ఆతని వీరత పాండిత్యములకాహవమల్లుఁ డచ్చెరువునంది యుండెను. విజయాదిత్యునిపై నాపశ్చిమచాళుక్యపతి కనురాగము లేకుండెను. పౌరుషముగాని పాండిత్యముగాని లేకుండుటయే యందులకుఁ గారణము. అట్టి మహానుభావుని తనయుఁడిట్లలరుదెంచుట వలనం దనకు సహాయుఁడగనుండి చోళులం దుముసుఁ జేరిన యీ చపలచిత్తునిపై నిరాకరణముం దుండిన యాగ్రహాగ్ని కాజ్యము పోసినట్లయ్యెను.

చోళులపై కరుగవలసి యుంటవలన నొకటి రెండు మాసములు తనకడనే యుండవలయుననియు నా యాహవానంతరము చపలుఁడగు విజయాదిత్యుని గద్దియపై కులోత్తుంగు నునిచి, కుబ్జవిష్ణువర్ధనునివలె నేల నేలించెదనని మాట నిచ్చెను. శారంగధరుఁడును సంతుష్టుఁడై సోమేశ్వర విక్రములతో మిత్రభావమున మెలఁగుచు నచటి రాజకార్యములందు జోక్యము గలిగించుకొనక, పరిస్థితుల గమనించుచుండెను.

సోమేశ్వరుఁడు కపటోపాయసమర్థుఁ డగుటవలన, సచివులను, సేనానుల దనవైపునకుఁ ద్రిప్పుకొనుచుండెను. సహజపరాక్రముఁడగు విక్రమాదిత్యుఁడెట రాజ్యాక్రమణ మొనర్చుకొనునో యని యాతఁడు సంసిద్ధుఁడై యుండెను. సోదరుని భావము గుర్తించి విక్రముఁడు పరాక్రమవంతులగు యువకుల పెక్కుర వెంటనిడుకొని వర్తించుచుండెను. భ్రాతృమనోవాంఛితమును విమర్శించు విక్రముఁడుకూడ పితృమరణా

నంతరము రాజ్యాధిపత్యము వహింపవలయునని తలంచు
చుండెను.

ఆ రాజేంద్రుఁడు తనయుల యాశాపిష్టతనుగాని, రాఁ
గల తనదుర్గతినిగాని గమనింపక సంప్రాప్తయత్నముల చోళుల
పరాజయమునకై పొనరించుచుండెను. సర్వముఖస్థ మందూ
కము నాహార సంపాదనేచ్ఛఁదగిలి యుండునుగదా! మఱు
క్షణమునందు రాఁగలస్థితి మానవుఁడెఱుంగఁగలిగిన నెంతటి
గర్వరాహిత్యతనంది యుండునో యెవరెఱుంగుదురు ?

---

## చతుర్దశ ప్రకరణము.

సమర సన్నాహములందుండిన దక్షిణభారతనృపతుల
వదలి చదువరులొక్కింత యుత్తరముగ రావలసియున్నది.

ఉత్తరకళింగము నుదయగిరి ప్రధాన పుటభేదనముగ
రణార్ణవుఁడు పాలించుచుండెను. క్రీ. శ. 840 ప్రాంతములం
దుత్తర దిశ కరుదెంచిన గాంగుల సంతతివారే యప్పటినుం
డియు నీ కళింగరాజ్యమును పాలించుచుండిరి. దక్షిణకళింగ
మనియు నుత్తర కళింగమనియు నీ దేశము రెండుగ భాగింపఁ
బడియుండెను. క్రీ. శ. 998 ప్రాంతముల దక్షిణకళింగమును
వజ్రహస్తుఁడు పాలించునపు డీభాగమును గుణార్ణవుఁ డేలు
చుండెను. అతని తనయుఁడు దానార్ణవుఁడు. పంచవింశతి
వత్సరములు ధరాభారము వహించి దివంగతుఁడయ్యెను.
ఆ నృపతిసుతుఁడు రణార్ణవుఁడు మన కథాకాలమున నేలికయై

యుండెను. ఈభూజాని యేఁబదివత్సరములు దాఁటినవాఁడు. అనపత్యుఁడు గాక పోయినను వ్యథాకుల హృదయుఁడు గాక తప్పినది కాదు. అదియొక కథ.

అప్పటి దక్షిణ కళింగ పతియగు వజ్రహస్తుఁడు 1050 వ సంవత్సరమున నధిపతి యయ్యెను. రాజ్యమున కరుదెంచిన దాది యీ భూభృత్తు స్వరాజ్య పరివృద్ధి నాకాంక్షించుచుండెను. కళింగమున కిరువు రధినాథు లుంట కంటె నొక్కఁడుంట సమంజసమని పలుమాఱు నతఁడు భావించియుండెను. భావించుటేమి? రాజ్యమునకు రాక ముందే జతనములు సల్పెను. రాజ్యాధిపత్యము వహించిన దన తెలుపవలయునా?

రణార్ణవునకు కాదంబరియను తనయ యుండినది. ఆయమ యైదవవత్సరమునందు వనమున విహరించుచు నగుపడకపోయెను. అగాధములగు సరస్సులం దెటనో యసువులఁ బాసెనని దాసీజనము దెలిపెను. రణార్ణవునకు మాత్రము నమ్మక మొదవలేదు. అహోరాత్రములు వెదకించెను. వెదక నేఁగిన వారికే వేసరిక యొదవెను. వత్సరములు గడచెను. అతని విచారమావంతయు తగ్గలేదు. తనయ యెటనో జీవించియే యున్నదని యతఁడు భావించుచునే యుండెను. ఆప్తులగు వారల నంపుచునే యుండెను. పితృవాత్సల్య మెంతటిది?

పదివత్సరములు గడచినవి. తన తనూజాత నపహరించిన యతఁడు స్వార్థపరుఁడై యుండుననియట్టివానిపోఁబడి

నతఁడు మనోవిధి నహరహము విచారించుచునే యుండెను. సచివుఁడు అభయంకరుఁడును, దక్షిణకళింగపతి వజ్రహస్తుఁడు నాతని కనుమానాస్పదులుగ నగుపడిరి. వజ్రహస్తుఁ డస్వ దేశ్యుఁడును, నృపుఁడనగుట ప్రవర్తనము బరిశీలింప నలవి కానిదయ్యెను. అభయంకరు నాశావిష్టత యంతకంతకు ఘనమగుటంచు సుతావియోగజాత మనోవైకల్య సంబాధితుఁ డయ్యెను రణార్ణవుఁడు వైశంగ గనుగొనఁ గలిగెను.

అభయంకరునకు స్వతంత్ర రాజ్యకాంక్ష లేకపోయి నను సామంతతనైన వహింపనలయునని యుండెను. నరేంద్రుఁడు దనపై ననుమానము గలిగియుండెనని గ్రహించి నంత యాతఁడాలస్య మొనర్పరాదని భావించెను. సర్వసేనాధ్యక్షుఁడగు నరేంద్రవర్మ సహాయము నభిలషించెను. కొన్ని జహాగీరుల కా వాహినీపతి సమ్మతి నొసంగెను. రణార్ణవుఁడు నరేంద్రవర్మ సహాయము తనకున్నదని దృఢవిశ్వాసమును వహించి యుండెను. దానివలన సచివుని ద్రోహమును బ్రకటించినచో, తనపదవి సుస్థిరముగ నుండునని భావించి యుండెను. కోశము, సేన, ఈ రెంటిని కలిగియుండినసే భూపతి యమాత్యునకు భయపడవలసి యుండునని యాతని భావము. ఆయిరువురు నభయంకరుని పక్షముజేరి యుండి రనుటా ధరణకాంతుఁ డెఱుఁగడు.

క్రీ. శ. 1053 వ సంవత్సరము ప్రధాని కార్యములు నరపతికి బొత్తుగా సరిపడని వయ్యెను. కాఁబట్టిసామంతులను,

తగువారిని రావించి సభయొనరించి మంత్రి స్వార్థపఱతను బ్రకటించి తన దేశమునుండి వెడలిపోవలసినదని రణార్ణవుఁ డాజ్ఞనొసరించెను. అభయంకరుఁ డా యానతి యన్యాయమైన దనియు, పదుగురలోఁ దన నవమాన పఱచినందులకు ప్రతీకార మొనర్చి తీరుదుననియు గంభీరముగ పలికెను. అందులకు వరూథినీభర్త నరేంద్రవర్మ, తన మేనఁ బ్రాణము లున్నంతవఱకునతఁడు దన యేలిక రాజ్యమునం దడుగువెట్ట నీలుండడని మేఘగంభీర భాషణములఁ బలికెను; రాజుబ్బి పోయెను. వీరులుగ్గడించిరి. సభ్యులు స్తుతించిరి. నైజమెఱింగిన యభయంకరుఁడు మాత్రము సంతసించెను. దరహాస మొనరించెను. తగిన సమాధానము నొసంగి సచివుఁడు సముచిత పరివారుఁడై ఉదయగిరి పురము వదలి ప్రాక్సముద్రప్రాంత నిబిడాటవులఁజేరి సైన్య సేకరణ మొనరించుచుండెను.

నాలుగు మాసములు గడచిపోయెను. ఉదయగిరి యందు నరేంద్రుఁడును దగిన యుద్ధసన్నాహముల నొనరించు చుండెను. ఎప్పుడో తన యడవిదండుతో నభయంకరుఁడు భయంకరుడై మీఁద పడునని పౌరులు భీతిల్లుచుండిరి. పురమందెచటచూచినను వీరభటులు సాయుధులై పచారు సలుపుచుండిరి. దుర్గద్వారములు మూసివేయఁబడి యుండెను. అనుమతిగొని గాని ప్రవేశనిర్గమములు జరుగకుండినవి. యాందోళనముతో పదునైదు దినములు గడచిపోయినవి.

పూర్ణిమానిశ పాలకడలి కాన్పు ధరాతలమునంతయు నమృతప్లావితము నొనర్చెను. శస్త్రైక జీవనులగు వీరులా

నైశమా జ్యోత్స్నయం దొక్క క్షణము మైమఱచి యటు నిటు దిరుగుచుండిరి. అభయంకరుని రాక, దినములు గడచు కొలంది, విశ్వసనీయముగా నిదగుట దుర్గముపైనుండు రక్షకులు నిద్రాదేవి యొడియందో, గృహములందుండు ప్రియురాండ్ర స్మరణమునందో మునిగి యుండిరి. అందులకుఁ గారణము రేవెలుఁగేయనిన చాలును. పదిగడియకాలము గడచిపోయి నది. ఉదయగిరియం దెలసూచినను నిశ్శబ్ద మలముకొని యుండినది. సమీపదుర్గమారణ్య మందలి వ్యాళజాల నినాదములు తప్ప మఱేమియు వినబడుట లేదు.

అట్టితఱి నిరువురువీరు లాజానేయముల నధిరోహించి పర్వతమార్గముల నతిజాగరూకులై పయన మొనరించుచుండిరి. నిశ్శబ్దముగ వారరుదెంచుట జూచినచో ఘన విచారమునకు లోనై యుండిరనియో, పరులకు తమపొలకువ తెలియ నిచ్చగింపరనియో గ్రహింపనగును. వారిరువురి వర్ణించుటకు వారు ప్రచ్ఛన్నులై యుండిరి. వా రుదయగిరి దుర్గము గమ్యస్థానముగ దలంచియుండిరని వారి గమనమును బట్టియే తెలుప నగును.

సూక్ష్మబుద్ధులగు పాఠకుల భావములు ప్రచ్ఛన్న వ్యక్తులనినంతన వనకేసరిపై కరిగియుండును. అవును. ఇఁకను దాపరిక మెందులకు ? వనకేసరి సహాయుఁడు మధ్యమ వయస్కుఁడు. ఆతని వసనములు రక్తిమములుగాక పీతములై యుండినవి. ఇరువురును కృపాణ పాణులును శరశరాసన

ధాతులునై యుండిరి. వారెట్టి సంభాషణము నొనర్ప కుండుట నా ద్వితీయుని గుఱించి యేమి తెలిసికొనుటకును వీలగునటులేదు. పోనిండు, ఆతురత యెందులకు? దుర్గమును సమీపించిరి. వారువములదిగిరి. దుర్గపుగోడ లత్యున్నతములై యుండినవి. వారందులకు వెనుదీసి యుండలేదనుట నూతన విషయము కాదు. అందలి మధ్యమవయస్కుఁడు నిజాశ్వముపై నుండిన త్రాడు నొకదానిని తీసి దాని కొక సంచియందుంప బడిన యుడుమును గట్టి విసరెను.

ప్రయత్నము ముమ్మారొనర్చిన పిదప నాజంతువొక స్థానమున కుదురుకొనెను. దానినిబట్టి లాగి పైకెక్కఁబోవు వనకేసరి నాపి యాద్వితీయవ్యక్తి పదిక్షణముల కాలములో దుర్గము నధిరోహించెను. నానరమైన నంత త్వరగ పోవ దనిపించకపోదు. ఇరువది ముప్పది విగడియల కాలము గడచిపోయినది. పైనుండి యెట్టి శబ్దముగాని వినిపించ దయ్యెను. వనకేసరి హృదయనేగ మతిశయించినదన వచ్చును. పైకి వదనమునెత్తి యాతురతతో నాయువకుఁడు విలోకించుచుండెను.

ఒక వస్తువు వచ్చినటు లగుపించెను. ఆ యువకుఁ డొకింత ప్రక్కకుఁ జరుగునప్పటి కొక శిరముపడెను. క్షతజ కణము లాతనిపై బడినవి. అంతనతఁడాగక త్రాడుబట్టికొని యెగ్రబ్రాక నారంభించెను. కొలఁదికాలములో నతఁడును కుడ్యోపరిభాగమును జేరెను. అట రెండవవ్యక్తి ముగ్గురు

భటులతోఁ బోరాడుచుండెను. వనకేసరి సహాయమున నాతఁడు వారలఁ దెగటార్చెను. అటుపై నా యిరువురు ప్రచ్ఛన్నాంగులు నాకుడ్యముపై బరుగిడుచు నొకతావును జేరిరి. అచట కుడ్యమెత్తుగ నుండినను రెండు దిమ్మలమధ్య నొకఁడు నిలచునంత స్థలముండినది.

ఆ దిమ్మలకొక బలమగు పగ్గము కట్టఁబడి యుండినది. దానికడ రెండవవ్యక్తినాపి వనకేసరి సోపానములఁదిగి చాల రహస్యముగ పయనము సాగించి సింహద్వారమును డాసెను. అట నలుగురువ్యక్తులు గుస గుస లాడుచుండిరి. వారి కెఱుక పడనటులతఁడు వారివెనుక నిలిచెను. ఒక విగడియకాలము గడచునంతలో నందులో నొకఁడు శిరోరహితు డయ్యెను. కృపాణమును బయల్పఱుపఁబోవు రెండవవ్యక్తి నిజరుధిరముతో ధరాస్థలిని ప్లావితమొనరుప వలసెను. పోరాడ నెంచు నాయిరువురు నొకింతవడిలో వనకేసరి బంధించివైచెను. అంత వనకేసరి వారల నుద్దేశించి:—

"నా మాటలు జాగ్రత్తమెయి వినుఁడు. నే చెప్పినటు లొనర్పవలయును. లేదా మీమిత్రులగతి మీకగును.

ఇఁక నొకటి రెండు గడియలలో మీరు ఎవరికొర కెదురు చూచుచుంటిరో వారురాఁగలరు. వచ్చినంత మీరు ముందు మహామంత్రిగారిని బ్రవేశము కాఁగోరుఁడు !

ఆతఁడు లోనికి వచ్చినంత చెఱియొక ద్వారమును మూసివేయుఁడు."

"మీరెవరు?"

"త్వరలో తెలిసికొందురు గాక"

"అయ్యా! మాకిది యిష్టములేదు"

"మఱి వీలులేదు" ప్రాణములపై నాసయుండినచేయ వలయును. ఈకార్యము మీయేలిక క్షేమమునకై యొనర్పఁబడినది. మీరు నేఁజెప్పినటుల జేయకపోయితిరా మీరాజుగారి ప్రాణముల నాక్రూరుఁడు తీయకమానఁడు."

"ఆఁ—ఎట్లు? మా సేనానిగారితో మాటాడుటకు గదా మంత్రిగారు వచ్చినది."

"మాటాడుటకు సైన్యముతో రావలయునా?"

"మీకెటుల తెలియును?"

"అదంతయు నెందులకు? గోఅది శబ్దము. తెల్పుడు నేజెప్పినటుల" అనుచు వనకేసరి వారి బాధనముల విప్పెను. వారిరువురును "మహామంత్రిగారు ముందు రావలయును" అనిరి

"ఆఁ—తెలుపు" డని వినిపించెను.

ఆభటులు సింహద్వారము నొకండు బ్రవేశించునంత మాత్రము వివృతమొనర్చిరి. స్థూలకాయుఁడగు సచివుఁడందుండి లోనికరుదెంచెను. ఆభటులిరువురును కవాటమును యథాప్రకారము మూసివైచిరి. ఉదరమున తనకరవాలమును నిలిపి వనకేసరి "మహామంత్రీ, అభయంకరునకు స్వాగత" మని గంభీరముగ బలికెను. సర్వదష్టుఁడయిన నంతగ నులికిపడఁడు. మహామంత్రిగారికి ముచ్చెమటలు పోసినవనినచో పారకు

లాతఁడు భీరుఁడనితలంతురు కాఁబోలును. కానిండు. వనకేసరి గడియనైచి యాభటులనిరువుర నభయంకరుని బాహువుల పట్టుకొనఁజేసి వెనుకనిలచి వారల పో నాజ్ఞాపించెను.

వనకేసరి చేతికరవాల మొక్కింత యెడమునకుఁ గుండి పోయెను. గుసగుసలు పరధ్యానమునం దుండిన వనకేసరి వినలేదు. తన దేహమునకు నాలుగొన తగులునవి కాతఁ డెద్దియో భావించుకొనుచుండెను. "ఓరీ! ఇపుడెవరధకులు" అనుమాటలు కశాఘాతములవలె నాతని చకితునొనర్చెను.

"నేను" అను మఱియొక గంభీరనినదము వినఁబడియెను. చర్మమును దాటి యొక్కైదువు అభయంకరుని వెన్నెముకను దగులుచుండెను. ఆతని చేతియందలి కత్తి యెప్పుడో క్రిందపడి పోయినది. ప్రచ్ఛన్నవ్యక్తిని మఱియొకరినిఁ జూచినంత నాయిరువురు భటులును పరుగిడిరి. అంత నా వనకేసరియు నతని సహాయుఁడును కంపితగాత్రుఁడగు నభయుంకరుని నడిపించుకొనుచు నరేంద్రవర్మ భవనమునకు గూర్చి పయన మైరి. వారాభవనము జేరినంత నటనుండు ద్వారపాలకు నావల త్రోసివైచి లోనఁ బ్రవేశించిరి.

నరేంద్రవర్మ నిదురించుటలేదు. పడకగదియందు పాదచ్ఛాయల వేయుచుండెను. వనకేసరి "చూడుము సేనా నాయకా! నీవు బ్రతికియుండగనే అభయంకరుఁడు ఉదయ గిరినిఁ బ్రవేశించెను" అని పలికెను.

నరేంద్రుఁడు మొదట అభయంకరుఁడు ప్రచ్ఛన్న వ్యక్తుల సహాయమున వచ్చియుండెనని భావించెను గాని మంత్రి వదనభావముఁ జూచినంత కార్యభంగమైనదని భావించెను. ఆభావన జన్మించిన యుత్తరక్షణముననే సేనానికరము కరవాలమున్నెడ కరిగెను. వనకేసరి సహాయుఁడది గమనించి యాతనికడకు లంఘించి యాకరమును బట్టుకొనెను. నరేంద్రుఁడు భటులకొఱకు కఱవఁబోవ నావ్యక్తి నోటిపైఁ గొట్టి "రాజద్రోహీ! ఱంచితివా యసువులఁ బాసెదవు!" అని గంభీరముగ ననెను.

ఒక నిముసములో వారిరువు రా రాజద్రోహుల బంధించిరి. వనకేసరి యటనుండి తాళపత్రముపై నొక్కింత వడి యేదియో వ్రాసి యా యిరువుర వెంటనిడుకొని రాజభవనముఁగూర్చి వెళ్ళి రాజభవన ద్వారపాలకుల జూచి బంధితులను, వ్రాసినలేఖను వారికొసంగి యావీరద్వయ మెందేని వెళ్ళెను.

---

## పంచదశ ప్రకరణము.



చూచుచుండగనే 1055 వ సంవత్సరము గడచి పోయినది. చోళపశ్చిమచాళుక్య వాహినులు మించిపోవు చుండినవి. తుపానురాకముందు సముద్రముండినటు లాంధ్ర దేశమునందు ప్రశాంతముగ కాలము జరిగిపోవుచుండెను. ఎవరు ముందు బయలు దేరుటయు విచారణీయముగ

నుండెను. 1056 వ సంవత్సర మారంభమైనది. గ్రీష్మవర్ష ఋతువులును దాటనుండెను. తగినంత కారణములేకనో, మతేనిమిత్తముననో యిరువాగులవారును స్వపురంబుల వదల కుండిరి. వాతాపి చుట్టుపట్టులను, ఉరయ్యూరు చుట్టుపట్టులను సైనికులు సమరవిహారము నలవఱచుకొనుచుండిరి. గజ యూధములపై నదుల నుత్తరించుటయు వాగువములపై పిల్లకాలువలు దాటుటయు వారికి దినచర్యలై పోయెను.

ఆ వత్సరము వర్షములు పరిమితముగ వచ్చినవి. నదులట్టె గానవోయినను దాటుట కష్టమనిపించు చుండినవి. చోళసేనాధ్యక్షుండగు వీరరాజేంద్రుండు తనపితామహుండగు గాజరాజును దలంచుకొని యతనివలె దైత్రయాత్ర సాగింప నెంచియూ నాలస్యమొనర్పరాదని సకల వాహినీ సమేతుండై బయలుదేరెను. ఆతడు పయనమైన పది దినముల వఱకును చాళుక్య గూఢచారు లాతనిమార్గము నెఱుంగలేక పోయిరి. జాంఘాలికులగు వారు తమ యేలికకు నావిషయ మెఱుక పఱచిరి.

కరుణాకర పల్లవుండు కంచినుండి కొంత సహాయ మంపెను కాని కీర్తివర్మ యా సైన్యమును వీరరాజేంద్రుం డనుకొనినటుల వెంబడింపడయ్యెను. సింహపురాధీశ్వరుండు నరసింహవర్మయు సైన్యసహాయమునంపెనేగాని మధుసూదనుండు దానితో రాడయ్యెను. వీరరాజేంద్రునకది విపరీతముగ దోచక పోలేదు. విజయుండు మాత్రము సముచితసేనానమే

తుఁడై అమరావతి కేఁబదికోసులు దక్షిణముననే కలసెను. చోళరాజు నిజసేన నొక సమప్రదేశమున నిలిపి, విజయునిచే ప్రబోధింపఁబడినవాఁడై కీర్తివర్మ, మధుసూదనుల తనతోఁ గలియరాఁ గోరుచు వార్తాహరుల నంపెను.

చోళులు కృష్ణాతుంగభద్రల సంగమ స్థానమున కరుదెంచుటఁ గని విని యాహవమల్లుఁడు తన సేనతో నా సంగమస్థానమును గూర్చి బయలు దేరెను. తన వాహినిగమనాయాసమును గాంచ కూడదని యాహవమల్లుఁడు దిన ప్రయాణముల మాని నిశాప్రయాణములతో తుంగభద్రా, కృష్ణవేణీ నదుల మధ్య భాగము నాక్రమించుకొనెను. ఆహవమల్లుని తనయులలో విక్రమాదిత్యుఁడు మాత్రము వచ్చియుండెను. సోమేశ్వరుఁడు పెక్కు కారణములఁ జూపి రాజధాని వదలకుండెను. కొన్ని కారణములు పాఠకులు గ్రహించి యుందురు.

నాలుగైదు దినములు గడచు నప్పటికి సింహపుర, కాంచీపురముల కరిగిన వార్తాహరులు లేఖలతోఁ దిరిగివచ్చిరి. గూఢచారులు చాళుక్యసేన సంగమేశ్వర క్షేత్రసమీపమున విడిసియుండెనని తెలిపిరి. వీరరాజేంద్రుఁడు ముందుగ తానా స్థలము నాక్రమింపక పోయినందులకు విచారించుచుఁ దన యాలస్యమునకుఁ గారణము పల్లవ రాకుమారులని భావించి వారిపై మండిపడెను. పల్లవరాకుమారులు లేఖలందు తామా తనికి సామంతులు కారనియు నందులకై తమపై నతఁడధి

కారము వహించు టంత సమంజసముగ నుండదనియు నడకువతోఁ దెల్పిరి. స్వతంత్రులగు వారిపై నధికారము వహింప గోరుట కార్యజ్ఞుల లక్షణముగాదనియు నాయకులు సూచించిరి. తోఁక త్రొక్కిన త్రాచువలె వీరరాజేంద్రుఁడు మండిపడెను. చాళుక్యుల మద మడంచిన తరువాత పల్లవుల డిల్లపడఁ జేయుదునని యట వీరుల మధ్యను ప్రతిన యొనరించెను.

అంత పరిస్థితులగూర్చి చాలకాలము యోచించి విజయునకు పల్లవసేనను సహాయముగ నొసంగి యమరావతికి వెళ్ళి యటనుండి యొరంగల్లు దిక్కుగ పయనమై కృష్ణానది కుత్తరముగ రావలసిన దనియు నటవేచియుండి తన సైన్యమున్నదిశను గొప్పజ్వాల కనుపడిన దినము కృష్ణనుదాటి చాళుక్యులపైఁ బడవలసిన దనియు నాజ్ఞాపించెను. సారంగధరుని విషయమును మరువని విజయుఁ డంతటి కార్యభారము తనపై నిడినందుల కమందానంద మంది యానాడే పయనమైపోయెను.

మఱియొక వారము దినములలో వీరరాజేంద్రుఁడు తన సేనతో తుంగభద్రానది దక్షిణతీరమున విడిసెను. బాగుగ ప్రవహించు నదుల మధ్యభాగమునందు చాళుక్య సేన సురక్షితమై యుండినది. వారినెదిరించు నుపాయము నన్వేషించుచు మదగజములను, ఓడలను నదియందు నిలుపుచు వీరరాజేంద్రుఁడు కాలము పుచ్చుచుండెను.

విజయాసింహుడు చాళుక్యసేన వెనుకభాగమును క్రి యుండవచ్చునని నమ్మకము గలిగినమీదట చాళుక్యుల నెదుర్కొన నాజ్ఞాపించెను.

తుంగభద్రా నదియందు మదగజముల నెక్కియు, నోడల నధిరోహించియు చోళసేన బయలుదేరెను. నదిని సగమువఱకు దాటి రనవచ్చును. అంతలో నున్నటులుండి యెటనుండియో బాణవర్షము గురిసెను. గజముల ఫాలములును, ఓడల యడుగుభాగములును శరములచే నిండి పోయెను. అందు పశ్చిమ చాళుక్యుల విలువిద్యా నైపుణ్య మంతయుఁ దెలియనగుచుండెను. అంపరచే బాధితమై గజయూధము మాఱుత్రోవను బట్టెను. ఓడలు రంధ్రముల నుండి నీరును గొనుచుండినవి. వీరభటులు లాలసింప రాదనుకొని యీదుచు వెనుదిరిగిరి. తీరమును జేరిరి.

మావటీంద్ర నేర్పుమెయి గజములు వెనుదిరిగెను. వీరరాజేంద్రుఁ డంధకారమున దాడిసాగింప నిది పొరబాటని తెలిసికొనెను. కొన్నివందల సేనమాత్రము నష్టమయ్యెను. అది వారికొక లెక్కయా? సమరము లెంతదారుణమైనవి? కొన్నివందల ప్రాణములు తృణప్రాయముగదా! జగదోద్ధారణ మొనర్చునదియు, క్షణ కాలములో నశించునదియు పురుషుఁడే! ఏమి చిత్రము?

ఇది జరిగిన దినద్వయ మెవరును సమరము సాగింప లేదు. ఒక నిశాసమయమున వీరరాజేంద్రుఁడు మరల సేనను

నదిదాటింప సంకల్పించుకొనెను. కందెనవోలు మండలము నందెటనో (అప్పటికీమండలమని లేదు) వర్షములు కురియు టంబట్టి తుంగభద్రానది విపరీతముగ వచ్చి యుండెనది. వీరభటులది లెక్కసేయక ప్రథమ ప్రయత్నమును తద్భంగ మును స్మరించి స్థిరచిత్తులై దాటయత్నించిరి.

ఇంతలో "శత్రువులు శత్రువు"లని పశ్చిమ భాగము నుండి వినవచ్చెను. నదీతీరమునఁ గలకలము మిఱిమీఱి పోవుచుండెను. అంతకుముందే నదినిదాటిన చాళుక్యులు చోళుల గుడారములకు నిగ్గి దరికొల్పిరి. ఆ జ్వాలఁ జూచినంత నదినిదాటఁదలంచిన వీరులనాపై పునకరుగ చోళనాయకు డాజ్ఞాపించెను. తానును కరవాల సహాయుఁడై యున్నతా శ్వమునెక్కి యటునై పరిగెను.

అట కృష్ణానది కుత్తరమునందు సైన్య సమేతుఁడై సంకేతమునకై యెదురు చూచుచుండిన విజయసింహుఁడా మంటలు తమవారు కావించినవిగాఁ దలంచి దక్షిణమునకు సంపూర్ణగమనము కలిగియుండిన చాళుక్యులకుఁ దెలియ కుండగ నదినిదాఁటెను. పరిపూర్ణ విశ్రాంతిగల వారగుట వలన పల్లవ పూర్వచాళుక్య సేన లొక్కమ్మగిని పశ్చిమ చాళుక్యులపైఁ బడెను.

పశ్చిమ చాళుక్య సేన యందలి ఘటికులను గొని విక్రమాదిత్యుఁడు గతదిన నిశాసమయమునందే తుంగ భద్రానదిని దాటియుండెను. ఆతఁడు దినశేషమును ప్రాంతపు

టడవులఁ గడపి యట చోళుల నెదిర్చెను. సమర మత్యంత ఘోరముగ తుంగభద్రానది యిరుపార్శ్వముల యందును జరుగుచుండెను. ఆరాత్రి యంతయు నటులే గడచెను. ఉదయమునందును, సమరము జరుగుచునే యుండెను.

---

## షోడశ ప్రకరణము.

త్రిపురసుందరి పదునెనిమిది వత్సరముల ప్రౌఢ. వీరాధివీరుని తనయ యగుటచే నాబిడ సమరవిషయముల చక్కగ నెఱింగియుండినది. అశ్వారోహణమందును, ఖడ్గచాలనమునందును, శరప్రయోగమందును నాబిడను మించినవారు చోళభూమి నట్టె లేరనిన చాలును. పురుష వేషధారిణియై యామె మోహనాంగి మృగయావిహారమునకుఁ బలుమారు వెళ్ళుచుండెడిది. సహజసౌందర్యవతి యగుటం బట్టి యామె స్త్రీయని యట్టివారుగానియులు దేనిని తెలంపఁ జాలకుండిరి.

వీరరాజేంద్రుడు పశ్చిమ చాళుక్యుల మదమడంప యత్నించు ప్రారంభించినప్పటినుండియు తరుణీలలామ మాహవరంగ దర్శనాపేక్ష కలదై యుండెను. మనోవాంఛ నప్పుడెపుడు జనకుని కెఱుకపఱచుచుండెను. వీరరాజేంద్రుడు పశ్చిమ చాళుక్యుల సమూల నాశనమొనర్చు ధైర్యము గలవాడగుటచే నామెరాక కడ్డుసెప్పకుండెను. అందువలన సమరమునకై చోళసేన బయలుదేరినంత నాబిడయు సము

చిత దాసీజన పరివృతయై కొంతదూరము ఆందోళికయందును కొంతదూరము వారువముపైనను మఱికొంతదూరము గజారూఢయయ్యును బయనమొనరించెను. దానిఁబట్టి చదువరులామె చపలచిత్తయని భావింతురు గాఁబోలును. స్త్రీలు సాధారణముగ చపలచిత్తలనియేకదా మన కవులు వాకొందురు; మన మూకొందము.

సింహాసనపరము జరిగిన దినమునకు దినద్వయము పూర్వము త్రిపురసుందరి విడిసిన చోటునకు పదిక్రోసుల దూరమునందుండిన యొక పర్వతాగ్రమందలి దైవమును దర్శింప నరిగియుండినది. ఆ లలన, దైవభక్తిమెయిగాదు వెళ్లినది. ఆ పర్వతము సూటిగనుండునని వినుట నామె యశ్వారోహయై దానినెక్కి తనసాహసము లోకమునకుఁ జాటింపఁ దలచి వెళ్లియుండెను. అదియటులుండనిండు.

చోళ సేనానాయకుని తనయుఁడు నటరాజవర్మపై నామె మానస మప్పుడపుడు పోవుచుండినది. నటరాజు రూపమునందును శౌర్యమునందు నసమానుఁడు. పాండితి మాత్రము శూన్యము. సర్వము నొకనియందుండునా? కోపమతనికి చాల దగ్గఱచుట్టము. కడపటి రెండువిషయములు తలంపున కరుదెంచిన సమయము లందుఁ దప్ప త్రిపుర కడగంటిచూపు లాయువకునిపైఁ బఱపుచుండినది. ఒకటి రెండు మారు లాతని శౌర్యము తన శౌర్యమును మించినదని తెలిసికొనిన దగుట కొలఁదిపాటి గౌరవమును గలిగియుండినది.

నేఁడాతని వెంటనిడుకొనియే దైవ దర్శనమున కరిగినది. నటరాజుమాత్ర మా సుందరితోడిదే లోకమని భావించు చుండెను. తన మనోదేవతా దర్శన మతఁడు మానునా? ఆపె తననుదప్ప యితర పురుషుల గన్నెత్తియైన చూడదను కొనఁచుండెను. ఆహా! పురుషులెంతటి మూర్ఖులు. స్త్రీల విషయమున నాపాటి మనస్థైర్యముగలవారై యుండినచో నెంతబాగుండెడిది. ఎంతగ, వియోగ, ఆశాభంగ జనిత పరితాపముల నందకుందురు. పురుషులకా భాగ్యము దైవ మీాయఁడు.

పోనిండు, వాహనములపై త్రిపురసుందరి నటరాజాది పరివారముతో నరుదెంచుచుండెను. సమరభూమికి వారు రెండు క్రోసుల దూరమునందుండిరి. ఇట త్రియామనంతయు శత్రుజన చ్ఛేదనముననే గడపుట నందఱును మనఃపూర్వ కముగ పొరకుండిరి. అందువలనఁ గలకల మంతగ నుండలేదు. ఘోరసమరము జరిగినదని తెలియకయే నిదానముగ వారు పయనము సాగించుచుండిరి.

వారికెదురుగ నొక యశ్వము పఱుగిడి వచ్చుచుండెను. ఆశ్వికునిఁ క్రింద పడవైచి వచ్చుచుండెనని తలంచి త్రిపురసుందరి యా విషయమును జెప్పి గట్టిగ హాస మొన రించెను. అందు నవ్వవలసిన యావశ్యకత లేకుండినను, దాస్యధర్మము ననుసరించి పరివారము నవ్వెను. తురగము సమీాపింప దానినుండి వ్రేలాడు నాశ్వికుఁడు వారి కంటఁ

బడెను. వారి ముఖములందొక మార్పుగుపడెను. నటరాజ వర్మ చటాలున దుమికి యాయశ్వము నాపెను. త్రిపుర సుందరియు దుమికి యాశ్వికుని వారువమునుండి తొలగించుట యందు సహాయపడెను. ఆశ్వికు నాకుమారి యాజ్ఞ మేరకు నొక పిల్లకాలువ సమీపమునందలి సమప్రదేశమునఁ బరుండ బెట్టిరి.

భటులుదెచ్చిన నీరముతో త్రిపురసుందరి యాశ్వికుని తలకుఁ దగిలిన గాయమందలి రుధిరమును దుడచి యొక విధముగ కట్టుఁగట్టఁబోవుచుండ నటరాజవర్మ సమీప మందలి యొక తీవరసము నంటించి కట్టుగట్టెను. అంతలో నావీరకాంత దేహమందలి యితరగాయము లందలిరక్తమును దుడిచి యామూర్తినిఁ దిలకించుచు కూర్చుండెను. మంద బుద్ధియగు నటరాజామాత్రము గ్రహింపజాలక పోయెను. ప్రణయమెట్టి సమయములందైన నుత్పన్నమగు ననుటా యువకుఁ డెఱుంగఁడు. యువతీహృదయ చాంచల్యము నెఱుంగగలట్టి రసికశిఖామణి నావీరుఁడు వడసియుండలేదు. ఆశ్వికుని మూర్తి నెంతజూచినను త్రిపురసుందరి నయనములు సంతృప్తి యనున దెఱుంగకుండినవి. ఒక దీర్ఘోచ్ఛ్వాసము మాత్ర మామె సుందరవదనమునుండి నిర్గతమయ్యెను.

కాలచక్ర మది యదనని బిరబిరతిరిగెను. ఒకటిరెండు గడియలకాలము గడచినది. ఆమెనయనములు మూతవడెను. సహజసౌందర్యవతి; విస్ఫారితనయన; అట్టిచో ననిమేషత నందిన యాపె దేవాంగనయన నెవరు సాహసింపరు? ఎవరు

సాహసింపక పోయిన నేమి, మూర్ఛదేరినయాతఁడు దలంచెను. ఆతఁడు తాను రణాంగణమున మరణించి పురాణములందుఁ దెలుపఁబడినటు రంభాసామీప్యము నందుండినటుల భావించెను. మతిభ్రమణమందిన యా శూరుఁడు పరివారమాడు కొనుమాటల దైవవాక్కులుగ భావించెను. గాయముల బాధనంది దేవలోకము కాదేమోయని యనుమానించి యా దేవీమూర్తి నటులే విలోకించుచుండెను.

మఱియొక్క గడియకాలము గడచి పోయినది. ఆశ్వికుఁ డొక్కింత తెలివినందినవాఁడై విషయముల గమనింపఁగలిగెను. హీనస్వరముతో,

"నా ప్రాణదాయినీ! నీవెవరు?" అని పలికెను.

"నటరాజవర్మ తెలుపఁబోవ నాపి యా రాకుమారి 'ఓశూరుఁడా! నీ వెవరు?' అని ప్రశ్నించెను.

ఆ వీరుఁడు పలుకిలేదు. రాకుమారి నోరు మెదల్ప లేదు. నాతి మృదులముగఁ బలుకఁగలిగి నందులకే యా బింబాధరి యచ్చెరువు నందుచుండెను గాఁబోలును. ఆ యువతీయువకుల నయనములు సంఘర్షణ మొనర్చుచుండినవి. ప్రక్కకేగుచుండినవి. ప్రణయ సందేశము లిరుపక్షములనుండియు నాగిపోవుచుండినవి. ఆ యిరువుర హృదయములు నిశ్శబ్దభాషను మిక్కుటముగ భాషించుకొనుచుండినవి. నటరాజవర్మ, త్రిపురసుందరిని ప్రాణప్రదముగ ప్రేమించు నటరాజవర్మ, మూగునివలె నిలిచియుండెను.

‘మగవాఁడో మ్రానో యన్నమాట నేఁటిమాటయె చెపుమా’ యన్న కవి సార్వభౌముఁడు వ్యర్థుఁడా ?

అంతలో కొందఱాశ్వికు లట కరుదెంచిరి. వారు త్రిపురసుందరికై యంపఁబడినవారు. ఆమెను చూచినంత వారువములనుండి దిగి తమ యేలిక యాపతి నెఱుకపఱచిరి. ఆబిడ యాశ్వికుని భద్రముగ వెంటతీసికొని రా నాజ్ఞాపించి జనకుని శిబిరమును గూర్చి పయనమయ్యెను. సమరభూమిఁ గడాసినంత జనకుఁడు భటుల నంపఁదగిన కారణము నూహించుకొనియెను. పాలికలని యందు నిర్భయముగ కరుణాలేశమైన గాంచని హృదయముతో నాబిడ పయనించి యాశ్వికునితో జనకుని శిబిరమును డాసెను. సుతాపితలు పరిష్వంగ మొనర్చినమీఁదఁ త్రిపురసుందరి యాశ్వికుని రక్షణమును గూర్చి ప్రస్తాపించెను. తనయ నోటినుండి యీ మాట వెలువడినంత నా శూరశిఖామణి రాజవైద్యుల నా యాశ్వికునిపయి జాగరూకత వహింప నాజ్ఞాపించెను.

వీరరాజేంద్రుఁడు పగతుర నిశ్శేషముగ పారఁద్రోలఁ గలిగినందుల కత్యధికానందమంది యుండుటపై యుత్సాహమునకుఁ గారణము.

వీరరాజేంద్రుని గుడారము విశాలమైనది. అందొక చో నాయాశ్వికునకు శయ్య యమర్పఁబడ వైద్యులటనే తగు చికిత్స లొనరించుచుండిరి. తన వాహినియందలి ప్రముఖులతో నా రాజచంద్రుఁడు నాఁటి యాహవ విశేషముల మాటాడుచుండెను.

యలు పోరాడిన పిదప క్షతగాత్రుఁడ నయ్యును నా వీరాగ్రణిని బంధింపఁ గలిగితిని. అంత నేమూర్ఛిల్లితిని. నేమూర్ఛదేరులోపల నీ యాహవమల్లుఁడు సమీపమం దుండిన వీరభటుని చుఱియ నొకదానిని పరీక్షించుటకై కొని హృదయమునందు పొడుచుకొనెను. సమయమునకు సరిగ కన్నులు దెఱచితిని గాని హీనస్వరుఁడనగుట భటుని యాకార్యము నాప దెలుపలేకపోయితిని.

భటులు మమ్మిరువుర నదిని దాటించి తమకడకుఁ గొనివచ్చిరి. త్రోవయందే యాచాళుక్య సార్వభౌముఁ డసువులబాసెను. శాత్రవుని బంధనములతోఁ జూచునవమానము కంటె యాత్మహత్యా సంభవ దురితమునే యభిలషించెను. వీరోచిత మరణమునకు నోచుకొనఁ జాలఁడయ్యెను" అని విజయుఁడు కథ ముగించెను.

అశ్వికుఁడు కెవ్వున కేకవైచెను. గాయములబాధ యనుకొని వైద్యులలో నొకడట కేఁగి యేవియో యౌషధములఁ బోసెను.

---

## సప్తదశ ప్రకరణము.



"మోహనాంగా! ఇటు చూడుము"

"ఎందులకు?"

"నీవిచారమునకుఁ గారణము వినుటకు"

"అబలా! నావిచారమున కంత మనునది లేదు"

"చోళరాజ తనయ తలంచిన నెట్టివిచారముండును?"

"సుందరీ! చోళరాజు తనయ కాదు. త్రిలోకనాథ తనయయు నావిచారమును బాపఁజాలదు."

"చెప్పరాదా!"

"రూపజిత సురసుందరీ! నను మాటాడింపకుము"

"ఏల?"

"నాహృదయమందలి పరితాప మతిశయించును"

"కారణము?"

"మానినీ! ఏల తెలియవు? సకలగుణశాలినివి. పరేంగితావగాహినివి కదా!"

"ఎందులకీప్రశంస?"

"అబలా! దాపనేల? నీపై మోహము నాకుఁగలదు"

"ఓ! అందులకా! పరితాపము. నా మాటలంబట్టియైన నాభావము గ్రహింపఁజాలకుంటివా?"

"అది గ్రహింపబట్టియే నాపరితాపము నెవ్వరును బాపజాలరంటిని."

"నేను నీయభిప్రాయముల గ్రహింపఁజాలకుంటిని"

"మోహనాంగీ! వినుము. నేను నిను వివాహమాడజాలను. ఒకవేళ నేనన్మతించినను నీజనకుఁడు సమ్మతింపఁడు."

"నాజనకుఁ డిప్పటి వరకు నా కోరిక నొకటియు రిత్తపుచ్చి యెఱుఁగఁడు."

"ఇదియే మొదటి దగును"

"కాదు లెమ్ము" అనుచుఁ ద్రిపురసుందరి యాయువకుని కరగ్రహణ మొనరుప యత్నించెను. ఒక సహాకార

కుటజమునానుకొని నిలచియుండిన యాయువకుఁ డటనుండి పలాయితుఁడయ్యెను. ఆయువకుని విపరీతచర్య కాచోళ నాయకతనయ యచ్చెరువునంది మ్రాన్పడి నిలిచిపోయెను. మన సారంగధరుఁడే యైనచో నామెనుజూచి చప్పన శత పద్యముల రచించియుండెడువాఁడే. త్రిపురసుందరి కమాంతముగ క్రోధ మొదవెను. దేహలత కంపితమైపోయెను. తన వలపునంది, తనను వలచి యుట పరుగిడిన యాయువకుఁ డున్మాదుఁడాయని యాయువిద భావించెను. మనసున నువ్వెత్తుగ మోహముత్పన్నమై క్రోధము నణచివైచెను.

మోహము మరల క్రోధమున కెడమిచ్చెను. క్రోధ మోహము లుప్పిరిగొనెను. అట్టి ద్వంద్వభావములకుం జిక్కి యాకరతలోదరి హృదయము క్షోభించిపోయెను. ఆ సంక్షోభమున నలసి యాసుమకోమలి తటాలున కూలబడెను. అంత నొకింతవడి కాముదవతిదిశలు పరికించెను. నాతిదూరమున మఱియొక యువకుఁడొక పొదరింటి దాపున నుపవిష్టుఁడై యుండెను. ఆతఁడె తన వలపుకాఁడాయని భావించి త్రిపుర హృదయ మానందరసమగ్నమైపోయెను. వానికెరుకలేకయే సమీపించెను. ఆమెకుఁ దెలియకయే యామె పాదములు నిలిచిపోయెను. ముఖమొక్కింత వైవర్ణ్యమునందెను. ఆమె హృదయమునందు తానా యువకునితో నాడిన మోహాలాపముల నుపవిష్టుఁడు వినియుండునా? యను సంశయము విద్యుల్లతికవలె మెఱసిపోయెను. ఒక కాంత, అందును

రూపగుణ సౌశీల్యముల కిరవగు కాంత, పురుషునిచే తిరస్క-రింపఁబడు టితరులు తెలియ నిచ్చగించునా?

ఆమె హృదయ సంశయముల నివారింప దలంచి కాంభోలు, నాయువకుఁడు "రాజకుమారీ! విచారింపకుము. ఆయువకుఁడు మరలరాఁడు."

"విజయసింహా! నీ కేమి తెలియును"

"ఇది వేఱొక కథ"

"నేను వినరాదా!"

"ఇప్పుడు కాదు"

"పోనిమ్ము, నీ దేహారోగ్య మెట్లున్నది?"

"మీ యాదరమునను, మీ వైద్యుల నైపుణ్యమునను స్వస్థుఁడనై యుంటిని"

"మహాజనకుఁడు నీకు వజ్రములు తాపిన చంద్రహార మొకటి బహుమాన మీఁగోరియుండెనుగదా!"

"మీరే తెలిపితిరి కాంభోలున."

"ఆ—ఏమితప్పు!"

ఆయిరువురవదలి పాఠకులు పరుగిడినయువకునిఁ జూడ రావలయును. ఆయువకుని ప్రజ్ఞానిధులగు మా చదువరులు విక్రమాదిత్యునిగఁ దెలిసియుందురు. తమ సేనా విచ్ఛిత్తియు, జనకుని మరణమును విని యాయువకుఁ డందిన పరితాప మింతింతనరానిది. తన నైజమెఱుకపఱచిన చోళనాథుఁడు బంధితునొనర్చునని త్రిపురకొక కల్పితకథను దనను గూర్చి

తెలిపి యుండెను. విక్రమునిరాకవినియుండిన వీరరాజేంద్రుం డతని పోటడి విచారించుచుండినను సంపూర్ణజయము వలనం గలిగినయానందము మేయి తనయింటనుండిన వానిగుఱించియే తెలియఁజాలడయ్యెను.

ఎట్లయిననేమి విక్రమాదిత్యుఁడు శత్రుజన మధ్యము నుండి తప్పించుకొనియెను. విజయుఁడు తనవిషయము నెవరికి నెఱుకపఱుపఁబడని విశ్వాసముగలవాఁడగుట నాతాకుమారుఁడు వెన్నాడువారెవరుగాని యుండరని విశ్వసించియుండెను. కానియాతని హృదయము సందేహ విధముగ నాందోళనము మితిమీఱుచుండినది. త్రిపురసుందరమూర్తి నాతఁడెంత యత్నించినను దూరము సేయఁజాలకుండెను. ఆతఁడధిరోహించిన యాజానేయ మెంత వేగముగ పరుగిడుచుండెనో యంత వేగముగ నాతనిమది త్రిపురసుందరి వదనపంకేరుహముకడ కరుగుచుండినది. తన జనకుని మరణమునకుం గారణుఁడగు వానితనయను దా వలచుటవివేకమని యాతఁడు సంకల్పించుకొనెను. ఫలమేమి? మనసిజుని యారడినాప నాతని శక్తి యేమాత్రము?

విక్రమాదిత్యుఁడు హుటాహుటి నడల వాతాపిని రెండవదిన మధ్యాహ్నమునకుం జేరెను. విక్రమాదిత్యుని యాకృతి చాల మారి యుండినది. ఆ పత్తనమునకు సమీపమునందుండిన యొక గ్రామాధికారియింట నాయువకుఁడు విశ్రమించెను. వారొసంగిన యాహారమును గొని

మైమఱచి యతఁడు నిదురించెను. ఆ నిశి యెటుగడచినదియు నతఁడెఱుంగఁడు.

భానూదయమైన యొక గడియకతఁడు మేల్కాంచెను. లేవఁబోయెనుగాని యతఁడశక్తుఁడై యుండెను. నిదానించి చూడ బంధితుఁడై యుండినటు లతఁడు గనుగొనెను. ప్రక్కకు జూడ తన కాశ్రయమొసంగిన గ్రామాధికారి తనయులతో బంధింపఁబడి యుండెను. దీనవదనుఁడై యా గ్రామాధికారి "రాకుమారా! నాయధిక ప్రసంగము మీ నిర్బంధమునకుఁ గారణమయ్యెను. మీయంతటి వారి రాక కుబ్బిపోయి యొకరిద్దఱు మిత్రులకుం దెల్పితిని. మీ సోదరుఁడు, సోమేశ్వరుఁడు మిము నిర్బంధించు వారల కైదువందల సువర్ణనాణెముల నొసంగెదనని ప్రకటించి యుండుటెఱుంగను" అనెను.

"నా దోషము?"

"మీరు శత్రుపక్షమును జేరి, మనసైన్య వినాశనమునకుఁ గారకులైతిరఁట."

"మన సైనికు లది నమ్మిరా?"

"రాకుమారా! రాజుమాటల నమ్మని సైనికులగతి తెలుపవలయునా?"

"హా! దైవమెంత కఠినుఁడు?"

అనునంతలో భటులు కొందరటఁ బ్రవేశించిరి. రాకుమారుఁడు మేల్కాంచుటఁ దెలసి వారాతని నెత్తుకొని పోయి యొక యాందోళికయం దుంచిరి. గ్రామాధికారి

సుతులతో నాపల్లకిని వెంబడింప నాజ్ఞాపింపఁబడెను. కొంత వడికి వారు వాతాపి పురమును బ్రవేశించిరి. విక్రమాదిత్యుఁ డొక యంధకార పరివ్యాప్త భవనమునం దుంపఁబడెను. సోమేశ్వరుఁడు గ్రామాధికారికి కొంత జరిమానాను విధించి యంపివేసెను.

ఆ యంధకారపు గదియందుబడి విక్రముఁడు విచారింప సాగెను. తన కంతకుపూర్వము సహాయులుగ నుండిన వారలలో నెవరు సమరమున నీల్గిరో, యెవరు జీవించి యుండిరో యతఁడెఱుంగ కుండెను. సోదరునికుట్ర కతఁ డావంతేనియు వింతపడి యుండలేదు. నిర్బంధము కర్మ ఫలమని యాతఁడు భావించునంతటి యవివేకి కాడు. రాచబిడ్డఁడెప్పటికి నటు లోనర్పఁడు. రాజ్యకాంక్ష మితి మీరియుండిన యా భూజాని తనయుఁడు తప్పించుకొన నెటులైన యత్నింపవలయునని నిశ్చయించుకొనెను.

ఆహారాదికములఁ గొనివచ్చువారు రాకొమరునితో మాటాడనైన తలంపకుండిరి. చూచుచుండగనే యొక మాసము గడచిపోయినది. ఆ ముప్పది దినములలో నాతఁడు కొన్ని విషయములఁ దెలిసికొనఁగలిగెను. ఆ గది దుర్గ కుడ్య ముపై నుండినది. దానియందు నిర్గమోపాయ సాధనము లెవ్వియు నుండలేదు. ఆ గదికుండు గవాక్షము కందకము వైపున కుండుటవలన నటనుండి పోనెంచుట బుద్ధిలేనితనము. ఆ గవాక్షమును పదునై దడుగులకు పై భాగమునందుంటం

బట్టి యాకుడ్యము స్నిగ్ధమైన దగుటవలనను దానిఁజేరు టశక్యమైనదై యుండెను. కాఁబట్టి యాంగవాక్షమునుండి నిర్గమించు నాలోచనము నతఁడు మానవలసి యుండెను. తన కాహారమును దెచ్చువాని గొంతు నులిమి తప్పించు కొనఁ నెంచుటను ద్వారము వెలుపల ఖడ్గపాణులగు భటులు సర్వదా నిలచియుంట చూచి మానెను.

దినములు గడచు కొలఁదిని విక్రమాదిత్యుఁడు తన పరాభవమునకుఁ గారణము విజయసింహుఁడే యని యూహింపసాగెను. ఆతఁడు రాకుండిన కృష్ణానదికి నుత్తరము నుండి వచ్చుటకు వీలుండెడిది కాదనియు, తనతండ్రి మరణమై యుండెడిది కాదనియుఁ బలుమారు తలంచెను. తలంచు టేమి? విజయుని దూషించెను. విజయునేమి యట్టివాని జన్మింపఁజేసినందులకు దైవమునే దూషించెను. మాసము గడచిపోయిన నాలవనాఁ డాతఁడు విచార హృదయుఁడై నిర్గమోపాయము గగనకుసుమమని భావించుచు, దైవా నుగ్రహమునఁ దప్పించికొనిన విజయసింహుని దప్పక సంకట పఱుప వలయుననియు భావించుచుండెను. నిర్బంధితునకు వివేచనమా?

తరువాత నొక శర మాంగవాక్షమునుండి లోని కరు దెంచి కవాటోపరిభాగ కుడ్యమును దగిలి క్రింద పడెను. దానికొక పత్రము గట్టబడియుండెను. ఆ రాకుమారుఁడది చూచి వింతపడకపోలేదు. నాలుగైదు క్షణముల కాలమది

తనతో మాటాడు నా యన్నటుల నిలచియుండి పిదపదానిని గొనెను. అందిటులుండెను.

"విక్రమాదిత్యా! కారాగ్రంతరమగ్న చిత్తుఁడనగు నేను నీ విషయమును దెలియనైతిని. నీ వరుదెంచుటయు, బంధింపఁబడుటయు నీకాశ్రయము నొసంగిన గ్రామాధికారి వలనఁ దెలియఁ గలిగితిని. వీరుఁడ వగు నీ నిర్బంధము నా కసహ్యము గొలిపెడిని. గత దినము నీవెటబంధింపఁబడిన దియుఁ దెలిసికొంటిని. నేటి నిశాసమయమున మఱియొక శరము నిటులే వేయుదును. దాని కొక పట్టుదారము గట్టఁ బడి యుండును. దానిని లాగుకొంటివేని బలమగు త్రాడును బడయఁ గలవు. ఆ రజ్జువును కవాటమునకో మఱెచ్చటనో గట్టివైచి తత్సహాయమున గవాక్షమునుండి వెలువడుము. కందకమునందొక పడవను నామిత్రుఁడు సిద్ధపఱచియుండును. దాని సహాయమున తీరము చేరిన నశ్వములతో సిద్ధముగ నుందును. అన్యథా భావింపక నే చెప్పినటుల సలుపుము.

నీ మిత్రుఁడు,

రాజనారాయణ 'వనకేసరి'

అది చదువుట నా బంధితుఁ డెన్నిమారులు పఠన రించెనో దైవమున కెఱుక. వనకేసరిని దీర్ఘాయువు నందు నటుల దీవించెనని యేల తెలుపరాదు? ఆ దినశేషము నా నిర్భాగ్యపు రాచబిడ్డ యెటుల గడపెనో యతఁడే యెఱుం గఁడు. అతని యుత్సుకత గమనించి భానుఁడు తటాలున

పశ్చిమాంబుధిని గ్రుంకెను. వెంటనే తిమిర మలముకొనెను. ఆహారమును దెచ్చిన వానితో నా రాసుతుం డుల్లాసముతో మాటాడెను. తన సోదరుని యోగక్షేమముల విచారించెను. వాడు వెడలిపోయిన పిదప గవాక్షమువైపు జూచుచు నంధకారమున నిలచియుండెను.

నాలుగైదు గడియలు గడచి పోయెను. శరము రాకుండుటవలన నతం డాశాభంగము నంద నారంభించెను. వనకేసరి మోసగించెనా యనుకొనెను. అటు తలంపరాదని నిశ్చయ పఱచుకొనెను. వనకేసరి కెట్టియాటంకమును గలుగ నీయరాదని తన యిష్ట దైవమును షడాననుని వేవిధములం బ్రార్థించెను. విజయసింహునిపై పగతీర్చుకొను భాగ్యము లేకపోయెనని విచారించెను.

అంతలో ననుకొనిన బాణము లోనంబడెను. దాని కుండినదారము నతి జాగరూకత మెయిలాగెను. అరగడియ గడచిపోయెను. ఆతని చేతికి బలమగు త్రాడుతగిలెను. దానిని భద్రమగుచోట బంధించి వస్త్రముల నెగగట్టుకొని దానిని బట్టుకొని చిన్నగ గవాక్షమును జేరెను. అందునుండి దిగజారెను. నీటిని సమీపించినంత బలిష్ఠకాయుం డొకం డాతనిబట్టుకొని పదిలముగ బాలునివలె నొకచో గూర్చుండం బెట్టుకొని పడవనునిశ్శబ్దముగ నడుపనారంభించెను. స్వేచ్ఛను బొందిన చాళుక్యరాజతనయుండు చల్లని గాలినిం బీల్చుచుండెను. కొంతవడికి పడవ తీరమును జేరెను.

అట మారణ సాధనముల సంఘట్టనారవము వారల చెవినిఁబడి వారల చకితుల నొనరించెను. పడవ నడిపిన పురుషుఁడు "రాకుమారా! మోసముజరిగినది. అటనుండు నశ్వములలో నొకదానిపై నెక్కి పలాయితుండవు గమ్ము. బ్రతికియుండిన పునర్దర్శనంబయ్యెడు" నని కరవాలహస్తుఁడై శబ్దమరుదెంచు దిశకు పరుగిడెను. రాకుమారుఁడవివేకియై పౌరుషమును బాటింపక పరుగిడెను.

ఆ పురుషుఁడు పరుగిడి వనకేసరికి బాసటయైనిలిచెను. ఇరువది మందితో వనకేసరి పోరాడుచుండెను. అంధకార మగుట నిజనైపుణ్యము నగుపరుపజాల కుండెను. ఆ పురుషసింహులిరువురు నా యాశ్వికదళములో సగభాగమునకు పైగా నఱకివైచిరి. ఏమఱుపాటున వనకేసరి నొకఁడు కరవాలముతోఁ బొడచెను. వనకేసరి క్రిందపడిపోయెను. తత్సహాయుఁ డుగ్రుఁడై మఱి నలుగురఁ జంపి యితరుల తరిమివైచి వనకేసరి నెత్తుకొని యశ్వము నెక్కి యెందేనిజనెను.

విక్రమాదిత్యుఁ డేగదియందు బంధింపఁబడినదియుఁ దెలిపినభటుఁడు సేనానాయకునకుఁ దనను బ్రశ్నించిన వారిని గుఱించి తెలుప నాశ్వికసేనతో నాతఁడట పొంచియుండి వనకేసరి నెదిరించెను. ఇది యందులకు పూర్వకథ.

---

# అష్టాదశ ప్రకరణము.

త్రిపురసుందరి జన్మించిన వేళావిశేష మెట్టిదోగాని యాశాభంగముల నంద నలవాటు పడిపోయెను. ప్రణయ మామెకు గగనకుసుమమై యుండినది. ఆయమ చిత్త మతి చంచలమైనదగుట సరిపోయెను గాని లేకుండిన నెపుడో యసువులఁ బాసియుండెడిదే!

మొదట నామె సారంగధరునిపైఁ దమి గలిగియుండినది. అది బాల్యమున జరిగినసంగతి. రసగ్రహణ శక్తి యంతగ నుండకుండినను మధురాంతకదేవి మోహించినదని తాను మోహించెను. ఆతఁడు సంగీత విద్యా ప్రవీణుఁడని లోకులు ప్రశంసించు చుండ నామెయుఁ బ్రశంసించినది. కాని యుదారహృదయులది యాశాభంగముగఁ దలంపక పోవచ్చును. ద్వితీయుఁడు విక్రమాదిత్యుఁడు. కాదు-కాదు. సేనాపతి తనయుఁడు నటరాజు. కాని యతనిపై నామె మొదటినుండియు మరులుకొని యుండలేదు. మచ్చిక పడిన జంతువువలె నా రాకుమారి చెప్పు కార్యములఁ గడు శ్రద్ధ మెయి నొనరించు చుండుటవలన వేతనముగ కడగంటి చూపుల విసరుచుండినది. విక్రమాదిత్యుని మాత్రము సంపూర్ణముగఁ బ్రేమించినటు తలంచినది. కాని యాభావము సమగ్రముగ హృదంతరాళమున నేర్పడునంతలో నామె హృద్రంగస్థలమున విజయుని పాత్ర ప్రవేశ పెట్టఁబడియెను. ఆతని ప్రశంసయే వీరభటుని నోటినుండియు వినుటవలన

వీరత్వపక్షపాత యగు తాను దనహృత్క్షేత్రమునం దా యువకునకుఁ దగిన తావొసంగకుంట లోపమని భావించెను.

విక్రమాదిత్యుని చూపులు మాటలు త్రిపురసున్నాదిని నొనర్చెను. విజయసింహునితో సంభాషణమునకు నవకాశమట్టె యా బింబాధరికొదవియు నుండలేదు. విక్రమాదిత్య త్రిపుర లేకాంత ప్రదేశమున నుండని దినమే లేక కాలమెంతయో గడచిపోయెను. తన హృదయాధినాథుఁడు విక్రమాదిత్యుఁడే యని యా రాసుత భావించెను.

ఆ కోనులి యాకాశ హర్మ్యముల నొక్క పెట్టున నేలఁబడవైచి విక్రముఁడు పలాయితుఁ డయ్యెను. అంత వినుగక త్రిపురసుందరి విజయునిపై నిజ మనో భావమును ద్రిప్పుకొనెను. నిజముగ తా నా యువకుని విషయమున గలిగియుండినంతటి రాగ మితరులపై నందియుండలేదని భావించెను. తప్పక విజయసింహుని ప్రణయబంధితు నొనర్ప దృఢసంకల్ప మొనరించెను. హావభావములచే నతని లో బఱచుకొన యత్నించెను. తన సాహసమున నాతని హృదయమును ద్రిప్పుకొన నారంభించెను. అశ్వారోహణమునందలి తన నేర్పుచే నా మదవతి విజయుని కచ్చెరువు గొలుప యత్నించెను.

కాని ఫలము? విజయసింహుఁ డంధుఁడు గాడు; అరసికుఁడుగాఁడు. త్రిపురసుందరి విక్రమాదిత్యుని యెడ జూపు ప్రణయదృక్కుల నతఁడు గమనించి యుండెను.

ఆశాభంగమున నత్యధిక దీనతావిష్టునుండై తిరుగు నటరాజవర్మ నతఁడు దిలకింపక పోలేదు. యువతీహృదయము పవనతాడితవారివాహమువంటిదని గ్రహింపకపోలేదు. ఆ పురుషద్వయమునకు సహాయుఁడుగ బో నతఁడిచ్చగింప డయ్యెను. విక్రముని పలాయనమైన పిదప త్రిపురయందలి మార్పు నతఁడు గ్రహించెను. నెమ్మది విరాగమును బొడు కొల్పెను. తనకుండు కార్యభారము నతఁడు స్మరించి వీర రాజేంద్రుని మెప్పువడసి సారంగధరునకు సహాయపడఁ దలచుచుండెను.

ఇఁకఁ జెప్పునదేమి. దినములు గడచుకొలఁది త్రిపురకు తమి యెక్కుడగుటయుఁ బ్రతిఫలము లేకపోవుటవలన నామెకు సహజమగు క్రోధ మగుబడుటయు నది దినముల వరుస నధికమగుటయుఁ బొసఁగెను. విజయసింహుఁడు లోకజ్ఞాన సంపన్నుడేగాని యిట బ్రమాదపడెను. తాను త్రిపురసుందరియెడల వహించిన వైముఖ్యము దనకార్యమున కనర్థదాయక మగునని యాతఁడొకనాఁడేని భావించియుండ లేదు. వీరరాజేంద్రుఁ డనుదినమును దనపై నభిమానము నత్యధికముగ గాంచుచుండెనని యుబ్బిపోవు చుండెను.

ఉరయ్యూరునకు మరలక, వీరరాజేంద్రుఁడు పల్లవ రాజ్యమందలి పినాకినీ నదీతీర పురమున విడసెను. నాలుగు మాసము లచటనుండినను నిజపురికేగ నతఁడు దలంపఁ డయ్యెను. ఎవరా వీరశిఖామణిని బ్రశ్నింప సాహసింప

రైరి. పల్లవరాజు మాత్రము కడుజాగరూకుఁడై యాతని కట్టి యిబ్బందియుఁ గలిగింపక మెలఁగుచుండెను. విజయసింహుఁ డొకటిరెండు మారులు తన యేలికయగు విజయాదిత్యుని దౌర్మార్గ్యమును గుఱించి ప్రస్తావించినపుడు కుపితుఁడైనటు నటించెను. అది నటనగ దెలియని విజయుఁడిక సారంగధరునకు భయములేదని భావించెను.

విజయసింహుఁ డెటకేఁగినను నలువురు చోళభటులాతని వెన్నాడుచునే యుండిరి. చాలకాలమునకుగాని విజయుఁడు వారిసాంగత్య వైపరీత్యము గమనింపఁడయ్యెను. గమనించిన పిదప వీరరాజేంద్రునిపై ననుమాన మమితమయ్యెను. విజయసింహుని సైన్యమతఁడెఱుఁగకయే యెటకో యంపఁబడెను. పది పదునైదు దినములకుగాని యతఁడు తన యసహాయత గమనింపఁ డయ్యెను. త్రిపురసుందరి ప్రేమాలాపములా యువకున కసహ్యములైపోయెను. కడకాతఁడు తనకట్టిస్థితి తిరస్కృతప్రణయయగు త్రిపుర వలననే గలిగెనని భావించెను. చేతులు గాలినమీద నాకులుబట్టిన నేమి లాభము ?

రాజేంద్రచోళుఁ డస్వస్థుడై యుండెనని విని వీరరాజేంద్రుఁడు సముచిత పరివారముతో, నరయ్యూరు చేరనేఁగెను. అతఁడట చేరినయొక మాసమునకు సకలసేనను రప్పించుకొనియెను. ఏయూహతో నతఁడు పల్లవదేశమున నుండెనో నది యెవరును గ్రహింపఁ జాలకుండిరి. మఱిరెండు

వత్సరము లాతఁడేమియు నలుపక యెద్దియో కార్యాలోచనా నిమగ్నుఁడై యుండిపోయెను.

ఇంతలో విక్రమాదిత్యుఁ డురయ్యాదు చేరి తన యసహాయస్థితిని దెలుపుకొనెను. తరతరములనుండి వైరము గలిగియుంటున వారి సంతతిలోని యొకఁడు తన నాశ్రయించి నందులకా చోళపతి యందిన యానంద మింతింతన రానిది. వెనుకముందులు చూడక విక్రమున కాశ్రయ మొసంగెను. అంతతో నిలక నా భూభృత్తు వాని యాలోచనముల నతి శ్రద్ధతో నాలకింప సాగెను.

విజయ సింహుఁ డిదంతయు వింతగ విలోకించు చుండెను. ఒకటిరెండు మారు లురయ్యూరువదలి పోదలంచి వ్యర్థ ప్రయత్నుడయ్యెను. త్రిపురసుందరి బాధ తప్పిపోయిన పిదప నతఁడా పెతనతో మాటాడనందులకు విచారింపసాగెను. తన యవివేకమునకు రహస్యముగ చింతించెను. పురుషు లెంతటి యవివేకులు. చేజిక్కియున్నపుడు నిరసింతురు; తప్పి పోయిన పిదప విలపింతురు. అది యటులుండ విక్రమాది త్యుఁడు క్రోధారుణితనేత్రుఁడై యాగుపడినపుడంతయుఁ జూచు చుండెను. అదంతయుఁ ద్రిపుర సుందరిచేతయని యతఁడు భావించెనుగాని నైజమును గ్రహింపఁ జాలడయ్యెను. ఆక్రో ధాగ్నికింధనముల త్రిపురసుందరి వేయకపోలేదు. విజయుఁడు తంత్రావాపసమర్థుఁడైనచో నటరాజవర్మ సహాయమునుగొని యుండెడి వాఁడేకాని యబలకు భయపడి సహాయ మభిలషిం చుటతఁడు న్యూనతగ భావించి యుండును.

విజయుని నిర్బంధము దినక్రమముగ నతిశయించి కడకొక భవనమునందుంపఁబడుట తటస్థించెను. తాఁదలఁచిన దొకటియు జరిగినది వేఱొకటియునగుట నతఁడత్యధిక విచారమునకు లోనయ్యెను. ఆశ్రయమొసఁగిన యాహావమల్లుఁడు హతుఁడగుటవలన మిత్రుని గతియేమయ్యెనో యను విచారము సనస్థితినిగూడ మఱచునటు లొనరించెను. విజయు నప్పటి మనోవ్యాకులము పగతునకైన వలదు.

ఇది యిటులుండ చోళనాథుఁడు రాజేంద్రుఁడు మరణించెను. వీరరాజేంద్రుఁ డేలికయయ్యెను. సర్వసేనాధిపత్యము నటరాజవర్మ వహించెను. విక్రమాదిత్యుఁడు సహాయ సేనాధిపత్యము వహించెను. త్రిపురసుందరి విక్రముల ప్రేమ నూతన శోభను వహించెను. విజయుని విచారము బాల్మె యాతని నస్వస్థు నొనరించెను. అట్టిపరిస్థితులలో విజయుఁడు వీరరాజేంద్రుఁడు పూర్వ చాళుక్యులపై నెత్తిపోనుండెనని విని కులిశపాతము నందినటుల విహ్వలుఁడై పోయెను. సారంగధరుని వెంటవెళ్ళి యుండినచో నిట్టి పరిణామము గలుగ కుండెడిదని యతఁడు దలంచెను. గతజలసేతు బంధనముతో బనియేమి? ఎటులైన దప్పించుకొని, తగుసేనతో విజయాదిత్యునకు సహాయ పడకుండిన పూర్వచాళుక్య రాజ్యరమ చోళహస్తగత మగునని యాతఁడు భావించెను. పల్లవపతి యిష్టపడకుండినను కీర్తివర్మ, మధుసూదనవర్మల సహాయము బడయఁ గలుగుదునను ధైర్య మా వీరకుమారుఁ డంది యుండెను.

మఱి తప్పించుకొనుటయో ? శత్రుజన మధ్యమునుండి పోవుట సాధ్యమా ? ఒకవైపు త్రిపురసుందరి, మఱియొక వైపు విక్రముఁడు జాగరూకులై వర్తించుచుండిరి. నటరాజ వర్మ మాత్రము వీరైనవు డంతయు, రహస్యముగ పఱుగిడుటంత కష్టసాధ్యముకాదని సూచించు చుండెను. వత్సరద్వయమట నున్మాదస్థితినుండిన వాఁడగుట విజయుఁడా భాషణము లందలిభావము నర్థముజేసికొన లేకుండెను. అదియుఁగాక నటరాజవర్మ విక్రమునిపైనను, త్రిపురసుందరి పైనను ప్రతీకార వాంఛగలట్టులా రాచబిడ్డను మోహించి యుండెనని యాతఁడెఱుంగడు.

యుద్ధయాత్రా ప్రయత్నములవారిగ జరుగుచుండెను. అశ్వముల నుత్తర హిందూస్తానమునుండి విక్రమాదిత్యు నాలోచనముపై వీరరాజేంద్రుఁడు దెప్పించుచుండెను. అందు గొన్నిఁటి నటరాజవర్మయుఁ గొన్నిఁటి విక్రముఁడు సుశిక్షిత ముల నొనర్చుచుండిరి. ఒక యాజానేయ మా యిరువు రకును సాధ్యపడనిదై యుండెను. నటరాజవర్మ వీరరాజేం ద్రునితో విజయుని ప్రస్తావనముదెచ్చెను. త్రిపురసుందరీ విక్రములు విహారమునకై వెళ్లియుండుట నాచోళనాథుఁడు సమ్మతించెను

విజయసింహుఁడు నిరుత్సాహుఁడై యుండినను శరీర వ్యాయామమునం దేమఱక యుండెను. నటరాజవర్మ రాజు గారియెదుర నూతనాశ్వమునుసాధువఱుపఁగోరెను. ఆ సంభా

వణమునందు విజయుఁడాతని కనుసైగను గమనించెను. అశ్వ ముత్తమజాతికిఁ జేరినది. దానిగన్నంత స్నిగ్ధములగు కాంతి ములఁగాంచిన ప్రాయసకానివలె విజయుఁ డుత్సాహాతి శయము నందెను.

అశ్వము నతి శ్రమపై నధిరోహించెను. ఆ యాజా నేయము దనకుఁ దగిన యాశ్వికుఁడు లభించినటు తెలిసి కొనినది. దాని విధేయత గమనించి నంత విజయసింహుఁడు రాజమార్గమును బట్టెను. ఆతఁడు పురిసింహద్వారమును జేరు వరకు నెల్లరు నాతని యభిప్రాయము గమనింపరైరి. గమ నించినపిదప ఫలములేకపోయెను. నటరాజవర్మ మాత్రము సమీపమందలి యాశ్వము నధిరోహించి వెంబడించెను. ఉత్తమాశ్వికుఁడగు విజయునాతఁడు గలియఁ జాలకపోయెను. కలియవలయునని నటరాజ వర్మ దలంచియు నుండలేదు. ప్రపంచమంతయు నటన.

---

## ఏకోనవింశతి ప్రకరణము.



విజయసింహుఁడు ఉరయ్యూరు పరిసరముల దాఁటి నంత నశ్వము నొకచో నాపి యెటులేగవలయునని యాలో చింపసాగెను. సేనారహితుఁడై రాజమహేంద్రవరము సేరిన ఫలముండదని యాతఁడూహించెను. ఎటులైన సారంగధరుని వెంటఁదీసికొనివచ్చినచో వీరభటులు కొందఱు చేరుదురనియు నా కొలఁది సేనతోఁ జోళుల కొంతకాలమాపవచ్చుననియుఁ

దలంచెను. అశ్వము దగిన నాయకుండు లభించినందుల కానంద మొందుచు బిసరుహ బాంధవసైంధవముల నధిక రించు వేగమునం బోసాగెను.

ఏలాంటివిశేషములును లేకయే యాపూర్వచాళుక్యసేనాని వాతాపి జేరెను. అట సారంగధరుని గుఱించి విచారింప పశ్చిమ కనుమలయందుండు వైజయంతి యందుండెనని తెలియవచ్చెను. ఏ పదిగడియలో విశ్రాంతిగొని యావీరుడు దక్షిణముగ బయలుదేరెను. మార్గమున న్యాయా న్యాయ ముల పరికింపక ఖేటమును గ్రామమును సంపాదించెను. మార్గము సముద్రదేశముగనుండమి యాతని పయనము చాల నిదానముగ జరిగెను. ఉరయ్యూరువదలిన యిరువదిదినముల కతండు పథశ్రాంతుండై వైజయంతినిం జేరెను. ఆపురమును జేరినపు డతడందిన యచ్చెరువునకు మేరలేదు. ఎట చూచినను వీర కుమారులు సాయుధులై యుండిరి. ఒకటి రెండు దినములలో జైత్రయాత్ర జరుగునటులాతండు గమనించెను. సారంగధరుం డుండు తావున యుద్ధసన్నాహ మతనికి వింత గొలిపినది.

ఆ వింతను మించిన వింతయుతండు గననుండు టెఱుంగడు. ఒకగొప్ప భవనమునందుం దనమిత్రుం డుండెనని విని యటకేంగెను. ఆభవనపు టుద్యానవాటికయందొక పురుష సంఘమునుగాంచి వారలడాసి యుల్లె నిలిచిపోయెను. అంత సారంగధరుండు "విజయా! వచ్చితివా? ఎంతటి సుదినము-

అనుచుఁ గౌఁగిలించుకొనియెను. ఆపరిష్వంగ మఱఁగడియ కాల మఁుండిన దనినచో మిత్ర వాత్సల్యమును జదువరు లూహింతురుగాక! స్వచ్ఛంద మైత్రి కిరవుగదా మనయాంధ్రావని.

"ఏమిమిత్రమా! అచ్చెరువునందుచుంటివి. వీరందఱును వీరుఁడవగు నీకుఁ బరిచితులే. ఇతఁడు రామసింహుఁడు. చోళనాథుఁ డంపినైచిన పూర్వచాళుక్యసేన కధినాథుఁడు. ఇతఁడు సింహాపుర యువరాజు మధుసూదన వర్మ. ఇతఁడు కీర్తివర్మ. ఇతఁడు మల్లయుద్ధనిపుణుఁడగు బిందుమాధవుఁడు. వీరందఱును నిను బ్రశంసింపని దినములేదు."

"వీరెందులకిట సమావేశమైరి?"

"నాకు సహాయపడుటకు. వీరివాత్సల్యము నేమందును. వీరికంటె నా వనకేసరి యెడ నెంతయుఁ గృతజ్ఞుఁడను."

"అతఁడెక్కడ?"

"ఉత్తర కళింగమునకుఁ గార్యాంతరమున నేఁగియుండెను."

"వీరు చాలరా?"

"చాలరని కాదు. ఆతని యాశయములు నాకెటు దెలియును. పోనిమ్ము. ఇన్నిదినములట నేమిచేయుచుంటివి. మా త్రిపురసుందరి క్షేమమా? బాలరాజు పరకేసరివర్మ యని నామము మార్చుకొనెనట గదా! క్షేమమా? విక్రమాదిత్యుఁ డెట్లున్నాఁడు? వేంగీదేశమును లోబఱచుకొనుట సులభమటగదా? నీవా పురమువదలి యిరువది దినములయ్యెగదా! ఇంత జాగెందులకు?"

"మిత్రమా! ఆగుము. ఇదేమి విపరీతము? శత యోజనముల దూరమునందుండిన నీ కివి యెటుదెలిసెను?"

"నటరాజవర్మ యొసఁగిన యశ్వమేది? దారిని వదలి వైచితివా?"

"సారంగధరా! నీకు యోగదృష్టి యున్నదాయేమి?"

"నాకుఁగాదు. 'వనకేసరికి.' అతని నడుగుము"

"వనకేసరి నీమనసు త్రిప్పఁ గలిగినందులకు నేనతని కెంతయుఁ గృతజ్ఞుఁడను."

"మనసు త్రిప్పుటేమి? నాపితృవ్యుని శిక్షింపఁ గాదు-రక్షించుటకుఁగదా మనము పోవునది"

"మఱి యీయాలస్య మెందులకు?"

"ఓయీ శూరుఁడా! విశ్రాంతి గొనుము. వారుర యొయ్యారు నింకను నగలలేదు. వారు పయన మారంభించిన పిదప మనమూశాస్త్రముగ పోయి తుంగభద్రానది యుత్తరపు టొడ్డున పయనించితిమేని వారికంటె రెండు దినములు ముందే కృష్ణానదిని దాఁటఁగలము. వారిని నదిని దాటనీకుండగనే పోరితిమేని బాగుండును."

"ఏమిది? మిత్రమా! నే నిదురించుట లేదుకదా! వ్యాకరణ సూత్రములఁ జెప్పిన నోటనేనా? యుద్ధసన్నాహములఁ దెలుపుచుంటివి. వనకేసరి శిష్యుఁడవైతివి కాఁబోలును. రాకుమారా! నాకీనాఁడెంతటి యానందమును గలిగించితివో తెలియుదువా? నిద్రాహారములు లేక యలసిన నా తనువు

సహస్రగజ సత్వముగలదై నది. ఆ వనకేసరికి సాగి మ్రొక్క నా యుల్లము తత్తరపడుచున్నది."

"ఆతఁ డగుపడినపు డటులే చేయుదువు లెమ్ము. సారంగధరా! ఏదీ యా చదరంగమును బూర్తినాడి చూపింపు" మని బిందుమాధవశర్మ యనెను. (కాదంబులు బ్రాహ్మణులని చరిత్ర చెప్పుచున్నది).

"సమర సన్నాహమును వదలి యాటయా?" అని విజయుఁడు బొమముడితో ననెను.

"విజయసింహుఁడు సర్వ సేనాధిపత్యము వహించు నటులున్నది" యని నాగసూనుఁడు నవ్వెను.

"వనకేసరి లేకున్న నితనికే యాధిపత్య మీయ వచ్చు" నని కీర్తివర్మ మహామాత్రుఁ గని నవ్వెను.

"రెండువత్సరములు శత్రుమధ్యమునందుండిన వీరున కంతటిపదవి యర్హమే" యని రామసింహుఁడు సవ్యాసనటులే నవ్వి పలికెను.

"ఆట శృంగారసుందరి లేకుండిన నన్నిదినములుండఁ" డని సారంగధరుఁడు రాజును జూపుచు ననెను.

విజయసింహుఁ డటనుండి వెళ్ళిపోయెను. అట సమావేశమైన వారందఱును బక్కున నవ్విరి. ఆ హాసమునకు విజయుఁడు వెనుదిరిగి వారల జూసెను. వారందరును గంభీరములగు వదనములతో గూర్చుండిరి. సారంగధరుఁడు వేణుగానము నారంభించెను. పచ్చికపై నావీరవర్గము సుఖముగఁ

బరుండెను. విజయుఁ డొక్కఁడునిలిచి వారలఁజూచుచుండెను. ఎవ్వరు నాతనిఁగూర్చుండఁ దెలుపరైరి. ఆగానమునకుఁ దన్మయుఁడై విజయసింహుఁడు గూలఁబడెను. అటులెంత కాలము గడపిరో వారేమెఱుఁగరు. భోజనమునకు వేళయైన దని పరిచారకులుదెలుప నెల్లరు నటనుండి వెళ్లిరి. ఒకప్పుడు మన యాంధ్రావనియందట్టి వీరు లిట్లుండిరా? మనకా దృశ్యము లేదుగదా! పాఠకులైన నట్లగుటకు యత్నింపరా!

నాలుగైదుదినములు గడచినమీఁద సర్వసైన్యమును గదలి యీశాన్యముగ బయలుదేరెను. ఇపుడు పాడుపడిన విజయనగర ముండుప్రదేశమున కెదురుగ నదీప్రాంతమున నాసేన పర్వతప్రదేశములఁ జేరెను. నాలుగైదు వేలకు మించని యాసేన యటగొప్పదిగ నగుపడుచుండెను. వారొక పర్వతమును సమీపించినంతన పర్వతాగ్రమునుండి శిలలు పడ నారంభించెను. హఠాత్తుగ గలిగిన యాకార్యమున కచ్చెరువు పడనివారు లేరు.

శత్రులెవరో, యెటనుండిరో తెలియమి వీరభటు లేమిచేయుటకును దోఁచక యాశిలావృష్టినుండి రక్షించు కొనుటకై యత్నించుచుండిరి. బిందుమాధవుఁడు తటాలున వెనుదిరిగి కొంతదూర మరిగి పర్వతము నారోహించెను. ఆతఁడుపరిభాగమును జేరునప్పటికే యట వనకేసరియొక్క సహాయునితోఁ బోరాడుచుండెను. బిందుమాధవుఁడు వనకేసరి రాక నొక కేకతోఁ గ్రిందివారికిఁ దెలిపెను. అంతనతఁడు

వనకేసరికి సహాయపడక యాతని నెదిరించు వారల సూక్ష్మముగ విలోకింపసాగెను. కొంతవడి కాతనిముఖమున నొక హాసరేఖ యగుపడెను.

తటాలున ముందునకరిగి యొక పురుషుని బట్టుకొని యమాంతముగ పైకెత్తి గంభీరముగ "ఓరీ! మీరస్త్రముల క్రిందఁ బడవైవకుండిన నితని నెత్తి పారవైచెదను." అని పలికెను. ఆ మాటలు మంత్రమువలె పనిచేసినవి. ఇంతలో కొందఱు వీరులు పర్వతారోహణము శిలావృష్టి తగ్గుటంబట్టి యొనరించిరి. వారొకమారు 'వనకేసరికి జయము జయము' అని కేక వేసిరి. విజయుఁడు వనకేసరికడ కరుదెంచి "మహావీరా! రాజనారాయణా! విజయసింహుఁడు నమస్కరించువాఁడు" అనెను.

"విజయసింహా! నమస్కారము. మీమిత్రుఁడుసారంగధరుఁడెక్కడ?" అని ప్రశ్నించెను.

"అవును. ఏడీ" యని పలువురనిరి ?

"అతడు నాలుగైదు దినములు వైజయంతి నదల వీలులేదని చెప్పెను" అని రామసింహుఁడు దరహాసముతోఁ బలికెను.

"మీతో నెందులకు దెలిపెను" అనివిజయుఁడనెను.

"సర్వసేనాధిపతి యాజ్ఞగొనెను గాబోలు"నని వనకేసరి మందస్మితముతోఁ బలికెను.

"నేనా ?" అని రామసింహుఁడు పలికెను.

"వీని నేమిచేయవలయు" నని బిందుమాధవుఁడ నెను. గట్టిగనవ్వి వనకేసరి "మిత్రమా! చిన్నగక్రిందఁబెట్టు మా చాళుక్య ధరాభర్తను, మూర్ఛిల్లినటులున్నాఁడు" అనెను. అందఱును నవ్విరి. ఆహా! ఏమి యావీరవరుల యదృష్టము. వారి హృదయాంతర్భాగము లెంత యానందమయములై యుండినవి. సమరమున వారికి విజయము దప్పదని యెవ రనరు! వీరత యానందమునకు సైదోడు కాఁబోలును.

మూర్ఛిల్లిన సోమేశ్వరు నాతని భటుల యధీన మొనరించి, యట్టినాయకునితో నరుదెంచి నందులకు నా వీరుల నలువిధముల పరిహాస వాక్యములఁ బలికి పర్వతావ రోహణ మొనరించిరి. మరల సైన్యము లోయలనుండి పయనము సాగించి, యొకపల్లెనుడాసి యట శిబిరముల వేసికొని యందఱును విశ్రాంతికై యాగిరి. వనకేసరి సహాయునితో నొక దూరమందలి శిబిరమునందుండి పోయెను.

---

## వింశతి ప్రకరణము.



విజయసింహుఁడు దప్పించుకొని పోయినందులకు విక్రమాదిత్యుఁడందిన పరితాప మింతింతనరానిది. తనను నిర్బంధించిన సోదరుని శిక్షించుటకంటె విజయ సింహున కాశ్రయ మీఁబోవు విజయాదిత్యుని శిక్షింపవలయునని

త్రిపురజనకునితోఁ జెప్పెను. తక్షణమే వాహినిని పయనించి వేంగీదేశమును నేలకుఁ దేవలయునని యాతనిసంకల్పము. కాని వాహినీ శబ్దము స్త్రీలింగమగుటచేత నాడువారితోఁ బ్రయాణమువలె యూఅనేక దినములు గడచిపోవుచుండెను. పృక్రమని కాలోకచో నిలుచుటలేదు. సర్వశ కంఠయగు త్రిపురసుందరితోనైన యాతఁడు సరిగ మాటాడలేదనినచో నాతని యుత్సుకత కొంత తెలిపినటులగును.

ఎట్టకేలకు వారు పయనమైరి. పల్లవ చళుక్య సేనలు లేకుండినను చోళవరూధిని లెక్కింపరానిదై యుండినది. సర్వసేనాధిపత్య మీయకుండినను విక్రమాదిత్యుఁడు వహించియే యుండెను. నటరాజవర్మ సాధారణ సేనానివలె వారిని వెంబడించు చుండెను. ఆతని వదనమునందటు దీనత గాని మందహాసతగాని యుండలేదు. రాఁబోవు సమరమునందతఁడు సంపూర్ణాభిమానముతో బోరాడుననుట సంశయాస్పదము. కతిపయ దినములకు వారు కృష్ణానదీప్రాంత నిబిడారణ్యముల కరుదెంచిరి. పిదప కృష్ణానదిని దాటు నుత్సుకతతో నడవి నిర్గమించిరి. మోహరించి యుండిన సేనను చూచి విభ్రాంతులైరి. ఒక్క నటరాజవర్మ ముఖము తప్ప నితరుల వదనము లన్నియు మ్లానములైన వనినచోఁ జాలును.

అచ్చెరువున కాశ్రయ మొసఁగిన వీరరాజేంద్రుఁడు దన వరూధిని పురోభాగమందు నిలచియుండ నొకశరమతని

పాదములకడ పడెను. దానియందు పత్రము నతఁడు గొని యిటు చదువ సాగెను.

“సార్వభౌమత నభిలషించు చోళరాజా! ఆశావిష్టుఁడగు రాజు వృద్ధి కరుదెంచుననిరిగాని,

‘అసంతుష్టో ద్విజో నష్టః । సంతుష్టో నచపార్థివః’

దురాశాపీడితుఁడగు ఱేఁడు దుఃఖమందును. ఎవని సహాయమున నాహవమ్ముల్లని గెలువగలిగితివో యట్టివాని నొకయవివేక మాటలబట్టి చాలకాలము నిర్బంధమునం దుంచితివి సరికదా అటు సహాయపడినవాని దేశమునే యువ్వెత్తుగ గొన నరుదెంచితివి. ఇట్టి యన్యాయము జరుగుచుండ జూచుట సజ్జన లక్షణము కాదు. అందువలన నిన్నెదిరింప నే నరుదెంచితిని. నీసోదరుని సంతానము హరించుటవలన గలిగిన పాపమునకు ప్రాయశ్చిత్తము నేడనుభవింప జేయ దైవ మనుగ్రహించును గాక!

‘రాజ నారాయణ వనకేసరి’

క్రోధవివశుఁడై చదువు వీరరాజేంద్రుని పురుషవేష ధారిణియగు త్రిపురతో విక్రముఁడు డాసెను. వీరరాజేంద్రు కరములనుండి యాతాళపత్రమును గొని చదివి విక్రముఁడు దండతాడిత భుజంగమువలె మండిపడెను. తత్క్షణమే హాసన్ముఖుఁడై సమీప వర్తియగు నటరాజవర్మతో సమరమునకు సైన్యమును గడంగ నాజ్ఞాపించెను. నటరాజవర్మ యశ్వము

నుండి దిగుచు "మహావీరా! ప్రయాణపు బడలికగల సైన్య మెటు పోరునని తలంచితి"రని నిందాగర్భముగఁ బలికెను.

"అధికప్రసంగ మవసరములేదు" అనుచు త్రిపురతో నటువాసెను.

ఆనాఁడే సమర మారంభమయ్యెను. విక్రమ వీర రాజేంద్రులు మధ్యందిన మార్తాండులవలె ప్రళయకాల రుద్రులవలె పోరాడిరనినను వారి సమరక్రీడ వర్ణించినటు కాదు. వనకేసరి వీరవర్గము ముందునకు రానేలేదు. వారి సేనాపతులు రామసింహుని ప్రోత్సాహమున జననష్టము కానటు పోరాడుచుండిరి. సూర్యుఁడస్తాద్రిఁ జేరునప్పటికి సమర మాగిపోయెను. చోళసేనకంటె చళుక్యసేనయందే జననష్టమెక్కుడు గలిగినది. కాని చోళసేన పథాయాసము రామసింహుని చాతుర్య కారితమగు సమరాయాసముచే వివశమై పోయెను. ఒక తృణసహాయముననైన వారిని కూల్చవేయవచ్చును.

దినకరుఁడు గగనేందిరనలంకరించెను. శవనివహముపై నాతని వెలుగుపడి వింతశోభ నాపాలికలిసికిఁ గలుగఁ జేయుచుండెను. యుద్ధ మారంభ మయ్యెను. ఎటఁజూచినను వీరరాజేంద్ర విక్రములే యుండిరి. వారంతటి దీక్షతోఁ బోరుటకు వారి శౌర్యమును నరాతి నిరాసంబే కారణంబై యుండును. విజయసింహాదు లున్నతాశ్వముల నధిరోహించి రామసింహుని డాసిరి. నూతనోత్సాహముతో తన సేనను

ద్వాన్ద్వయుద్ధమునకుం గడంగ నాజ్ఞాపించెను. సంకుల సమర మారంభ మయ్యెను. అప్పటి యాహావమును వర్ణించు టలవిగానిపని.

వీరరాజేంద్రవిజయులును మధుసూదన విక్రములును ద్వంద్వయుద్ధము నారంభించిరి. ఒకరికొకరు తీసిపోవువారు గారు. గడియలకొలఁది పోరాడిరి. అట్టిచో మధుసూదను నశ్వము నొకచోళుఁడు శూలముతోఁ బొడిచెను. దానినుండి ప్రక్కకు దుముకులోపల నది పడుట వలనఁ దప్పించుకొన జాలకపోయెను. యుద్ధధర్మమును వదలి విక్రమాదిత్యుఁడు కరవాలము నెత్తెను. ఆ కరవాలము చేతినివదలి పదిగజముల దూరమునఁ బడిపోయెను. వనకేసరియట ప్రత్యక్షమయ్యెను. "మఱియొక కైదువు నందుకొనుము" అనుచు నా శూరుఁడు వారువమును దొలగించి మధుసూదనునకు సహాయుపడెను. అంత విక్రమునితో

"ఔరా! ఇంతటిశూరుఁడవా? విక్రమా! ననుమించిన వీరుని నీశ్యాలకు నొసర్చనెంచి వనకేసరి గాక పరకేసరియని పిలువసాగితివి కాబోలును? ఆ పిఱికిపందకు పేరైన యుండ వలయునని తలంచితివా? రమ్ము. వనకేసరి యెంతటి పరాక్రమవంతుడో చూచి యాపేరును మార్తువుగాని" అనెను.

కరవాలసంఘట్టన శబ్దమయ్యెను. మారుతుని వాలు తగులనటు లతిచమత్కారముగ పోరుచుండిరి. సమీప వర్తితులగు భటులాయుధముల నేలవైచి యటు చూచుచు

నిలచితి. వనకేసరి ఖడ్గప్రచాలననైపుణ్యమంతయు నేకరువు బెట్టి నాలుగైదుమారులు గాయపఱచెను. విక్రముఁడలసి పోయి రెండు మారులు పడఁబోయెను.

"విశ్రాంతి కావలయునా?" అని వనకేసరియను లోపల కరవాలద్వయ మాతని నిరుపార్శ్వముల గ్రుచ్చుకొనెను. అంతలో విక్రముఁ డొకింత సేదదేరెను.

నటరాజవర్మ వనకేసరీవిక్రముల పోరుజూచుచు నిలచియుండెను. అపుడు విక్రముఁడు క్షతగాత్రుఁడగుటచూచి సంతసింపక పోలేదు కాని యాతని సహజశౌర్య మాతని నుద్రేకపూరితు నొనరించినది. వనకేసరి పరాక్రమాతిశయమును గూర్చి యాతఁడు వినియుండెను. అది కేవలమసహ్యమై యుండినది. వానితో ద్వంద్వయుద్ధ మొనరింప బలుమారు లెంచి యుండెను.

విక్రమునకు సహాయపడ బోవలయునా వలదా యనుకొనుచుండెను. అంతలో పురుష వేషధారిణియగు త్రిపుర యరుదెంచి విక్రమునిఁజూపి చేయిపట్టి లాగెను. తాఁ బ్రేమించిన కాంతలాగుట నతఁడు ముందునకేఁగి వనకేసరిని కత్తితోఁ దాకెను.

వనకేసరి విషయమును గమనించి తటాలున వెనుక కడుగిడెను. త్రిపుర వాలుగ్రుచ్చుకొనక పోలేదు. దానినతఁ డపుడు గమనింపలేదు. ఆయిరువురతో నొక యఱగడియ పోరునప్పటి కలసటతీర్చుకొని విక్రముఁడాతనిపై కరుగు

దెంచెను. వనకేసరి యతి చమత్కారముగ వారినుండి తప్పించుకొనుచుండెను. మనశూరుఁ డొక్క గాయము నందు లోపల విక్రమ నటరాజులు మఱిరెండు గాయములనందిరి. ఆ యసమ సమర మింకెంత కాలము జరుగుచుండెడిదో గాని యీ పరిస్థితులు సంపూర్ణముగ మారిపోయెను.

త్రిపురసుందరి పైకెత్తబడెను. నటరాజుల ముగ్గురును విక్రము నిద్దరును వీరులు కరవాలములతో బోవను సిద్ధపడి యుండిరి. వనకేసరి యదిచూచి హాసముతో "శర్మగారూ! మీరెత్తినది కాంత యనెను. అవును. అటులెత్తినది బిందు మాధవశర్మయే. ఎత్తఁబడినది త్రిపురకదా! ఆ విప్రుఁడు కాంతను పైకెత్తినందుల కసహ్యపడి పనికిరాని వస్తువును వదలినటు వదలివైచెను. త్రిపుర నడుము లవిరునటు క్రిందపడి నిలువ నశక్తయై యటుచూచుచుండెను.

వనకేసరి తన సహాయులఁజూచి "కీర్తివర్మ మధు సూదనులారా! ఆ ముగ్గురెవరు? ఓహో! మీరా?" అని యట్టహాస మొనరించెను. అంతలో విజయసింహ రామసింహు లరుదెంచి వీరరాజేంద్రుని బలాయనమును దెలిపిరి.

"మీ రిరువురున్న చోట జయమునకుఁ గొదువయా" యని త్రిపురను లేపుచు వనకేసరియని "త్రిపురా! అటు చూడుము! నీసోదరి మధురాంతక దేవి. ఆమె వాసంతికా దేవి. పల్లవరాజతనయ అదిగో ఆమె. మదాలస సింహపుర

నాథుని తనూభవ. స్త్రీలు సమరమున కరుదెంచిన పిదప నాకీ కరవాలమెందులకు ?" అని నిలచెను.

ఉన్నటులుండి యట కరుదెంచిన వీరులు వనకేసరినిఁ బట్టుకొనిరి. వనకేసరి సహాయుఁ డరుదెంచి "వలదు, మీ కెందుల కాశ్రమ ?" అనుచు వనకేసరి ముఖముపై నుండు రక్తాంబరమును దొలగించెను. విక్రమ నటరాజులే యాశ్చర్య పడిరనిన చో వనకేసరిని పట్టుకొనిన వారి విషయము జెప్పనేల ? వీరలోకమా ! మీ మిత్రుఁడు సారంగధరుఁడు నమస్కరించువాడు" అని వనకేసరి యనెను.

"తనయా ! సారంగధరా ! ఎంతటి చతురుఁడవు ! భీరునివలె నెంత చక్కఁగ నటించితివి" అనెను.

"అమ్మా ! వీరునివలె నుండిమాత్రము చేయునదేమి? పితృవ్యుని శిక్షించుటెటుల ?

"అవును తనయా! క్షమాభిక్ష కావలయును" అనుచు నలసిన యాకృతితో విజయాదిత్యుడట కరుదెంచెను.

"ఇదేమి తండ్రీ! ఎందుల కిటు లరుదెంచితిరి ?"

"ఏమున్నది. నాయనా ! ఆ క్రూరుఁడు నారాయణ భట్టు నను పురి వెడలగొట్టెను."

"ఆఁ—" అని యట సమావేశితులందఱు ననిరి.

"మఱిలెందు. ఆ బ్రాహ్మణబ్రువుని ఖండించి మఱి విశ్రాంతి నందుదము"

"ఒక్కింత విశ్రాంతి యవసరమని వనకేసరి సహాయుఁడనెను."

"ఔను. మఱచితిని. మిత్రులారా! ఈ మహాశయుఁడు రణధవళుఁడను కళింగుఁడు; మాజనకుని మిత్రుఁడు"

"నా గురువు"

"మిత్రుఁడు కాఁడు. సేవకుఁడు" అని రణధవళుఁడనెను.

"నా ప్రతికార్యము నాతని సహాయమునన్నైనది"

"కాని తనయా! ఆనాఁడు నీ వస్త్రములఁ జూచితిని గాని యీ యంబరములగుపడలేదే!"

"తల్లీ! మీరు వాని లోపలిభాగమును జూడలేదు."

"అటులనా!" అని యాపె స్మితమొనరించెను.

వారి యానందముతో మనకవసరములేదు. వనకేసరి సారంగధరుఁడని కొందఱు తెలిసియుండుట వలన భావము లంతగ వర్ణనీయములు గావు.



## ఉపసంహారము.

సారంగధరుఁడందిన గాయములకు, రణధవళుఁడు వనౌషధులతో కట్టులఁగట్టెను. వాసంతిక తన విశాలమగు కందోయితో నా రాకుమారునకుఁ బరిచర్య యొనర్చుచుండినది. రత్నసింహునిచే బట్టువడిననాఁటి తనచర్య, ఆ చిత్తరువునుజించి పారవైచినచర్య, భావవీధిని బాయకుండెను. అక్కార్యము సారంగధరుఁడు గమనింపకుండినచో నింతగ

నామె వ్యధనంది యుండెడిదికాదు. మధురాంతక మంజుల లతని నైజమెఱింగిన వారగుట వింతపడవలసిన యావశ్యకత లేకుండినది.

రామసింహు నాధిపత్యమున మరల యాసేన పయన మారంభించెను. విజయవాడయందు సత్కరింపఁబడి రాజమహేంద్రవరమును సకాలమున డాసిరి. రాజమహేంద్రవరదుర్గము నెటుల వశమొనర్చు కొనుటాయని యావీరు లాలోచించు కొనుచుండిరి. ఆ పురిని సమీపించువఱకు నొక నిశ్చయమునకు వారు వచ్చియుండలేదు. పురద్వారములు తెఱువఁ బడియుండఁబట్టి, వారికచ్చెరువు గలుగకపోలేదు. నారాయణభట్టు పురరక్షణమునం దప్రమత్తుఁడై యుండునని వారనుకొని యుండలేదు.

సైనిక కోలాహలము పురమున వినిపించినంతనే కొందఱు పురుషులు పురినిర్గమించిరి. వారు విరోధభావమున వచ్చుచుండిరేమో యని యిక్కడివారు జాగ్రత్తపడక పోలేదు. కాని వారుసమీపించినంత సారంగధరుఁ డశ్వమును దిగెను. అదిచూచి వీరులందఱు నటులొనరించిరి.

"కళింగనాయకునకు సారంగధరుఁడు నమస్కరించు వాఁడు"

"వత్సా! చక్రవర్తివిగమ్ము."

"అదిగో! మీతనయ కాదంబరి నను రక్షింప తన మిత్రులతో కంచినివీడి యుద్ధరంగమున కరుదెంచినది"

వాక్యము ముగియకముందే పితాసుతులు పరిష్వంగ సుఖమనుభవించుచుండిరి. ఆహా! పితృవాత్సల్యమహిమ నెవరు వర్ణింపఁగలరు? ఒక యఱగడియకు పైగాఁ గాలము గడచిపోయినది. సారంగధరుఁ డేదియో యనఁబోవుచుండ రణార్ద్ర వుఁడు.

"వత్సా! సారంగధరా! నేనీపురి సమాచారముల గమనించుచునే యుంటిని. నాఁడు నీవటు ధైర్యము సెప్పిన మీఁద నీ నిగూఢవర్తనావశ్యకత కెంతయు నలరి నీపితృవ్యుని పై నొకకన్ను బెట్టుకొనియే యుంటిని. నారాయణభట్టు దుస్తంత్రము లేనాఁటి కానాఁడు నాకెఱుక పడుచుండినవి. అందువలన విజయాదిత్యుఁడు పలాయితుఁ డయ్యెనని తెలిసి నంత సముచితసేనతో నరుదెంచి యీ బ్రాహ్మణ బ్రువుని బంధించివైచితిని."

"రాజచంద్రా! మీఋణము నెటు తీర్చుకొందును?"

"నా ఋణమా! సారంగధరా! ఏల యీమాటలు? నా సచివసేనానుల ద్రోహమును వెలిబుచ్చి నా రాజ్యమును నిష్కంటక మొనర్చితివి. నాతనయ నొసంగి నా మానసము నకుఁ బ్రశాంతి నొసంగితివి. వజ్రహస్తునిమైత్రియు నాకొసంగు టకు నీవ కారణమని రణధవళుని వలన తెలియనయ్యెను."

"ఓ! ఈప్రశంసలకు గాలమున్నదిలెండు పోదము."

రణధవళుఁడు కళింగ విషయములు మధుసూద నాదుల కెఱుకపఱచుచుండ నెల్లరు రాజమహేంద్రవరమును

ప్రవేశించిరి. పురము సారంగధరుని రాకను బొందిన యానందము వర్ణనాతీతము.

ఒక శుభ ముహూర్తమున సారంగధరుఁడు వేంగీదేశమునకుఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. అటజరిగిన విషయములన్నియు వ్రాయు టతివిస్తరమగును. సారంగధరుఁడు రాజనారాయణ కులోత్తుంగ దేవుఁడను బిరుదమున వ్యవహరింపబడుచుండెను. మధురాంతకదేవి, వాసంతిక, కాదంబరీలను వివాహమయ్యెనని చెప్పు టనవసరము.

కీర్తివర్మ వైజయంతి యందుండినపుడు తిరువణ్ణామలె యందలి యోగివలన జ్ఞానోపదేశ మందిన వాఁడగుటవలన తన సోదరితో పల్లవరాజ్యమును సారంగధరుని వశమొనర్చి సర్వసంగ పరిత్యాగియై వెడలిపోయెను. మధుసూదనవర్మ సర్వసేనాధిపత్యము వహించి రాజమహేంద్ర వరమునందే యుండిపోయెను. మధురలాలస, విజయాదిత్యులొక భవనమునందుండిరి. రామసింహ విజయసింహులు పల్లవ, చాళుక్య రాజ్య మధ్యభాగముల నేలుచు సారంగధరునకుసామంతులై యుండ నియమింపఁ బడిరి. అందులకు వారియ్యకొనరైరిగాన ఫలము లేదయ్యెను. ఆ వీరద్వయమున కది శిక్షగఁ దోచినది. కాని వారిరువురును రాజమహేంద్ర వరమునందే వత్సరమునందుఁ జాలకాల ముండిరనినచో సత్యమునకు దూరము కాదు. రణధవళుని వెంటగొని రణార్ణవుఁడు నాలుగైదు మాసములకుఁ బిదప కళింగమున కేఁగెను.

1069 వ సంవత్సరము వీరరాజేంద్రుఁడు పరలోక గమన మొనరించెను. సేనాబలయుతుఁడగు నటరాజవర్మ రాజరాజును ధరాపాలనమునకుంచి సర్వాధికారముల వహించెను. త్రిపురసుందరితో విక్రముఁడా దేశమును వదలి పోయెను. విజయసింహ రామసింహుల రాజ్యముల నాక్రమింప కపటోపాయము లొనరించెడు సోమేశ్వరుని దండింప కులోత్తుంగుఁడు వెళ్లెను. ఆసమయమున పశ్చిమ చాళుక్య సేన యూ్రపాంతములందు ప్రచ్ఛన్నుఁడై యుండిన విక్రమాదిత్యుని నాయకత్వమును వహించెను.

1069 లో నాయుద్ధము పొసఁగినది. అందు జయాపజయములు నిర్ణయింపరానివై యుండినవి. విక్రమాదిత్యుఁడు సంధి నభిలషించెను. కులోత్తుంగుఁడు రాజమహేంద్రవరము జేరి నంతన విక్రమాదిత్యుఁడు తన సేనతోఁ చోళదేశముపై నేఁగి రాజరాజ నడరాజవర్మలఁ జంపి తన శ్యాలకుఁడగు పరకేసరి వర్మను రాజ్యాధినాథు నొనరించెను.

కులోత్తుంగుఁడిదివిని మండిపడి సకల వాహిని పరివృతుఁడై యేఁగి పరకేసరి వర్మను తఱిమి నటరాజ వర్మపక్షము వారభిలషించుటనుబట్టి చోళదేశమున 1076 సంవత్సరాంతమున కులోత్తుంగ చోళదేవి చక్రవర్తియనుపేర పట్టభద్రుఁడయ్యెను. మూఁడు తరములనుండి చోళదేశకన్యల వివాహమైన వారగుట నా రాజ్యాధిపత్యాధికారమునుగల వాడయ్యెను.

1080 వరకును నిష్ఫలముగ ఆగవ విక్రమాదిత్యుఁడు చోళ దేశమునకై యత్నించెనుగాని వ్యర్థ మనోరథు డయ్యెను. అంతస్థిరముగ నొకసంధిచేసికొని సౌమనస్యతతో నుండెను. విజయాదిత్యుఁడు వేంగి దేశమునకు రాజప్రతినిధియై యుండెను. అతఁడట చాలకాల ముండలేదు.

సారంగధరుఁడు కాడు. కులోత్తుంగ చోళదేవచక్రవర్తి తన జ్యేష్ఠతనయుని రాజేంద్రుననట ప్రతినిధిగా బంపెను. తనతనయను రాజసుందరిని కళింగనాయకుఁడగు వజ్రహస్తుని తనయునకు రాజరాజునకు నొసంగి యా దేశమునుండి తొందర కలుగనటు లొనరించుకొనెను.

పాఠక మహాశయులు క్షమింపవలయును. ఇందుఁ జెప్పిన యంశములతోఁ గథ పెంచవలసి యుండెను. కాని మన యాంధ్రప్రభువు తమిళప్రభువై పోయెనను విరక్తియే వ్రాయనీయదయ్యెను. అట తమిళకవుల దగ్గఱ తీసెననియు వారినుండి కబ్బములనందెననియుఁ జరిత్రలు చెప్పుచున్నవి. ఆంధ్రశబ్ద చింతామణిపై నభిమానముగల యతఁడాంధ్ర కన్నెను వదలిన మీఁద మనమేల యాతని గుఱించి చదువ వలయును? ఆతని పట్టమహిషి తమిళ కాంత యగుటిందులకు గారణమని మహాత్ముఁడు త్యాగరాజుగారి. “ఎంత నేర్చిన, ఎంత చదివిన. ఎంతవారలైన కాంతదాసులే!” అను పదజాలము స్మరించి యింతటితోఁ జాలింతము సెలవు.

( శ్రీరామచంద్రార్పణమస్తు )